# గురు గీతా



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్య, ధర్మశాస్త్రాది అనేక విషయాలు తెలుసుకోండి...


గ్రంథ నిధి
THE TREASURE OF PAGE
FIRSTEVER TELUGU FREE E-BOOKS DOWNLOADING WEB PORTAL

ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

www.granthanidhi.blogspot.in

# శ్రీ గురుగీత

సర్వస్వామ్యములు రచయితవి

ప్రచురణ సంఖ్య – 14
ప్రథమ ముద్రణ 2000 – సం॥ ఆగష్టు
ప్రతులు 1000

ప్రతులకు :
1. శ్రీ దాదన చిన్నయ్య
ఇ.నెం. 17/700–A1, తిలక్‌నగర్
గుంతకల్లు- 515 801
ఫోన్ : 28652.

2. శ్రేష్ఠి శ్రీ వంకదారు రామక్రిష్ణయ్యశ్రేష్ఠి
ఇ.నెం. 10/142, మండి బజార్
గుంతకల్లు- 515 801
ఫోన్ : 26442.

వెల రూ. 25/–

ముద్రణ : శ్రీ సత్యభార్గవి ఆఫ్‌సెట్ ప్రింటర్స్.
సి.బి. రోడ్, తాడిపత్రి – 515 411.
అనంతపురం (జిల్లా)
ఫోన్ : 73132.

# పరిచయ భాగ్యం

శ్లో॥ సత్యం సత్యం పునః సత్యం ధర్మసారం మయోదితం ।
గురుగీతా సమం స్తోత్రం నాస్తితత్త్వం గురోః పరమ్ ॥
(శ్రీగురుగీత 3వ అ-256శ్లో)

గురుగీత ( బోలు స్తోత్రము, వర గురుని కంటే శ్రేష్ఠ తత్త్వము లేదని శ్లోకార్థము. ఇట్టి గురుస్తోత్రమును, వర గురుని తత్త్వమును పరమేశ్వరుడు పార్వతికి స్వయముగా నుపదేశించినాడు. దీనిని ''శ్రీగురుగీత'' గా వేదవ్యాస మహర్షి స్కాందపురాణము ద్వారా లోకానికి అందించాడు. సంస్కృతములో నున్న శ్రీ గురుగీతను సరళ సుందరమైన తెలుగు భాషలో మద్గురు వరేణ్యులు, కవిరత్న శ్రీ దాదన చిన్నయ్యగారు పద్యాలుగా అనువదించినారు. వీరు అనంతపురం జిల్లా తాడిపత్రి తాలూకా నారాయణరెడ్డిపల్లెలో జన్మించారు. రైతు కుటుంబానికి చెందిన శ్రీమతి సుబ్బమాంబ, శ్రీబయన్నలు వీరి తల్లిదండ్రులు.

శ్రీ చిన్నయ్యగారు తిరుపతి శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య కళాశాలలో చదివి విద్వాన్ పట్టా పుచ్చుకొని, రాజమండ్రిలో తెలుగు పండిత శిక్షణను పూర్తిచేసి, గుంతకల్లులో యస్.జె.పి. హైస్కూలు మరియు బాలుర పురపాలకోన్నత పాఠశాలలో తెలుగు పండితులుగా 35 సంవత్సరాలు పనిచేసి 1990 లో పదవీ విరమణ గావించారు. వీరు అఖండ ప్రతిభా సంపన్నులు, సంస్కృతాంధ్ర భాషా పాండిత్య సంశోభితులు, అనేకానేక సాహితీ ప్రక్రియా స్రష్టలు, సత్త్వగుణ పథానువర్తులు, సనాతన ధర్మ పరాయణులు, ఆదర్శోపాధ్యాయులు.

వీరు శ్రీభారతీ సాహితీ సమితి వ్యవస్థాపకులలో ప్రముఖులై, సాహితీ సంస్థ ద్వారా అనేక సాహితీ కార్యక్రమాలను ఏర్పాటు చేసి కవిపండితులను సత్కరించారు. వీరి కలం నుండి అనేక కావ్యాలు వెలువడ్డాయి. శ్రీ బళ్ళారి దుర్గాంబికా శతకము, ఋషి సూక్తులు, తెలుగు రవలు, శ్రీ ఆంజనేయ శతకము, శ్రీ మద్భాగవతము, రఘు విజయము, శ్రీ వాసవీ విజయం, భువన విజయం, కవిసార్వభౌమ శ్రీనాథ, కసాపుర శ్రీ ఆంజనేయ సుప్రభాతం, శ్రీ శ్రీనివాస కళ్యాణం, శ్రీ వీరబ్రహ్మంగారి చరిత్ర మెదలగునవి వీరి రచనలు. వీరు రచించిన ప్రతి కావ్యము ఒక ఆణిముత్యం. వీరిచే రచింపబడి, శ్రీమతి వేదవతి ప్రభాకరరావు గారిచే గానము చేయబడిన ''కసాపురం శ్రీ ఆంజనేయ సుప్రభాతం'' ప్రతి దినం ఉషఃకాలమున కసాపుర దేవాలయమున భక్తకోటికి వినిపింపబడుచున్నది. కడప ఆకాశవాణి కేంద్రంవారు మంగళవారాలలో దీనిని ప్రసారము చేయుచున్నారు. వీరి రచనయగు శ్రీ శ్రీనివాస కల్యాణమును అనంతపురంలో గల ''అనంతకళాపీఠం'' అను సంస్థవారు ఆవిష్కరించుటయేగాక, శ్రీ చిన్నయ్యగారిని బ్రహ్మశ్రీ కల్లూరు వేంకటనారాయణరావు స్మారక అవార్డుతో సత్కరించారు. వీరు చేయుచున్న పద్య కవితా సేవకు మెచ్చి ''శ్రీసాహితీ గగన్ మహల్ఘనగిరి'' సంస్థవారు ''అనంత ఆణిముత్యం'' గా గౌరవించి సత్కరించారు.

పురాకృత పుణ్యం వలన వీరి సాహచర్యం నాకు లభించింది. మేము ఇరువురము ఒకే పాఠశాలలో పనిచేయడం ఒకే మనస్తత్వం కలిగియుండడం వలన ''దాదన చక్రాల కవులు'' అను పేరున కొన్ని గ్రంథాలను రచించినాము. అవి ముద్రణలో నున్నవి.

శ్రీ గురుగీతలో మూడు అధ్యాయములున్నవి. 352 శ్లోకాలకు 352 తెలుగు అనువాద పద్యాలున్నవి. అనువాదం కష్టతరమైన విషయం. కవి మనోభావం గ్రహించాలి. పాఠకుని భాషా పటిమను గుర్తించాలి. కాలానుగుణ భాషలో అనువదించాలి. ఈ విషయములో వీరు కృతకృత్యులయ్యారు. విషయ విభాగాలు సముచితంగా నున్నవి.

ఇటువంటి ఆణిముత్యాల వంటి కావ్యాలను మరికొన్ని వీరు రచించాలని, అట్టిశక్తిని పార్వతీ పరమేశ్వరులు వీరికి అందించాలని అకాంక్షించుచున్నాను.

కం. వేదాత్మక సత్కవితా<br>
రాధనమే తనదు బ్రతుకు, ప్రాణము, కర్త<br>
వ్యాదులుగా మదినెంచిన<br>
దాదనచిన్నయ్య ఘనవదాన్య నకు-నతుల్

ఇట్లు<br>
విబుధ జన సేవకుడు<br>
అవధానభారతి, సాహితీ చతురానన చక్రాల లక్ష్మీకాంత రాజారావు.<br>
యమ్. ఏ.<br>
పురపాలక బాలికోన్నత పాఠశాల,<br>
గుంతకల్లు.



ఓం నమో భగవతే శ్రీమదుమామహేశ్వరాయ
శివాయ గురవేనమః
శ్రీవాసవాంబాయైనమః

పూజ్యపాద
శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరానందగిరి స్వాములవారు.
శ్రీ వాసవీ పీఠాధిపతులు,
బెంగుళూరు.

అత్యంత దుర్లభమైన మానవ జన్మను సార్థకమొనర్చుకొనుటకు గురువును సమాశ్రయించుట అత్యవసరము ''ఆచార్య వాన్ పురుషోవేద'' ''ఆచార్యోపాసనం'' ''తద్విద్ధిప్రణిపాతేన------జ్ఞానినః తత్త్వదర్శినః''అని గీతోపనిషత్తుల వాక్యములు. కావున గురువుయొక్క మాహాత్మ్యమును తెలిసికొనుట ముఖ్యము. అట్టి గురుతత్త్వమును గురించి కైలాసాధిపతియగు పరమేశ్వరుడు పార్వతికి చెప్పినదే శ్రీ గురుగీత. ఈ గురుగీతయందు గురువు ఎట్టివాడు? గురుతత్త్వమెటువంటిది? ఎన్ని విధములగు గురువులున్నారు, గురుకృపవలన పొందు లాభము, సాధకులకు కావలసిన అనేక విషయములు వివరింపబడినవి. ఇంతకు పూర్వము ఆంధ్రానువాదము జరిగినది. ఇప్పుడు గుంతకల్లు విశ్రాంతాంధ్రోపాధ్యాయులు కవిరత్న విద్వాన్ శ్రీ దాదన చిన్నయ్యగారు శ్రీగురుగీతను ఆంధ్రపద్యానువాదమును చేసినారు. అచ్చటచ్చట చదివితిని బాగున్నది, సరళమైన భాషలో రచన చేసినారు. బాగుగా పరిశ్రమించినారు. సంతోషము. ఈ గ్రంథమును అనేక పుణ్యకార్యములు=సాహిత్యసేవ, సామాజికసేవ, ఆధ్యాత్మిక సేవ చేసిన శ్రీవాసవీసేవారత్న, సుధీవర శ్రీవంకదారు రామకృష్ణయ్య గారు ముద్రణగావించి పాఠకులకు అందించుచున్నారు. చాలా సంతోషమునొందించు కార్యమును చేసినారు. శ్రీరామకృష్ణయ్యగారికి, వీరికుటుంబ సభ్యులకు, రచయిత శ్రీ దాదన చిన్నయ్య గారికి జగన్మాత సర్వశుభములను ప్రసాదించి ప్రోచును గాక!

ఓం తత్సత్



తేది : 1-7-2000

*SRIMANNARAYANA RAMANUJA YATHIBHYO NAMAHA*

**JEEYAR EDUCATIONAL TRUST**

**Founder and Managing Trustee**

**His Holiness Sri Sri Sri Tridandi**

**Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji**

సీతానగరం,
**15-9-2000**

## ఆచార్యదేవోభవ

శ్రీమతే నారాయణాయనమః
అనేక మంగళాశాసనములు

ఎన్నో క్షేత్ర మాహాత్మ్యాలను పొందు పరచుకున్నది స్కాందం. దాక్షిణాత్యులకు ప్రీతి పాత్రం.

ఇందులో ఉన్న ''గురుగీత'' ను తెలుగులో కూడా తేటగీతలనే వీలయినంతవరకూ ఆదరిస్తూ మూలవిధేయంగా అనువదించేరు శ్రీ మాన్ కవిరత్న విద్వాన్ చిన్నయ్యగారు. వారి ఆంధ్రీకరణం చక్కగా సరళంగా సాగింది.

సంస్కృతంలో ఉన్న దీన్ని తేటతెలుగులో అనువదించి ఈ రూపంగా గురుభక్తిని చాటుకున్నారు శ్రీ మాన్ చిన్నయ్యగారు. వారి అక్షరార్చనకు అనేక మంగళాశాసనాలు కావిస్తున్నాం.

జై శ్రీమన్నారాయణ

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ
రామనుజయ్యరు స్వామి వారు

Vedic University, Seetanagaram - 522 501. Guntur Dist. (A.P.)

# అభినందన

**ఆచార్య ఎన్. గోపి** M.A., Phd.

ఉపాధ్యక్షులు,
పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

ఇది శ్రీ వేదవ్యాస మహర్షి విరచిత స్కాందపురాణంలోని శ్రీగురుగీతకు కవిరత్న, విద్వాన్ దాదన చిన్నయ్యగారు కావించిన తెలుగుసేత. శ్రీ చిన్నయ్యగారు విశ్రాంతాంధ్రోపాధ్యాయులు. కాని అవిశ్రాంతంగా ఆంధ్ర భాషాసేవను కొనసాగిస్తూనే వున్నారు. 352 శ్లోకాలకు తేటగీతుల్లో అనువాదాన్ని వెలయించారు. శ్లోకం క్రిందనే అనువాద పద్యాన్ని ముద్రించడం ఎంతో సముచితంగా ఉంది. వారి విద్వత్తుపైన వారికంత నమ్మకం. శ్లోకాన్ని, అనువాద పద్యాన్నీ పోలుస్తూ తారతమ్య వివేచన చెయ్యడం నాపనికాదు. సహృదయులైన మీరే ఈ లోకరీతుల భాండాగారంలోకి ప్రవేశించండి. అప్పుడు పేరుకు చిన్నయ్యగారు కాని విద్వత్తులో అన్నయ్యగారని మీకే తెలుస్తుంది.

చిన్నయ్యగారూ! ఇటువంటి లోకోపయోగకరమైన వ్యాసంగాన్ని ముందుముందు చెయ్యటానికి భగవంతుడు మీకు ఆయురారోగ్యాలు ప్రసాదించాలని కోరుకుంటున్నాను.



ఎన్. గోపి ప్రొఫెసర్

# అభినందన

శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి
M.A., (Eng, Tel) B.Ed., D.Litt.,
రిటైర్డ్ ఇంగ్లీషు లెక్చరర్,
1/1845, గాంధీనగర్, కడప.

శ్లో॥ బ్రహ్మసూత్రకృతే తస్మైవేదవ్యాసాయ వేధసే।
జ్ఞానశక్త్యవతారాయనమో భగవతే హరేః॥

వ్యాసమహర్షి జ్ఞానశక్త్యవతారమూర్తియని భామతీ -భాష్యకారుడు వాచస్పతి మిత్రుడు స్తుతించినాడు.

వ్యాసులవారు నారాయణ సదృశులు. వ్యాసవాఙ్మయం త్రివేణీ సంగమం వంటిది. అందులో ఒక పాయ బ్రహ్మ సూత్ర రచన, రెండవపాయ అష్టాదశ పురాణ రచన, మూడవపాయ మహాభారతం.

వేదాన్ వ్యస్యతీతి వేదవ్యాసః
వేదాలను విభజించి వేదవ్యాసులుగ స్తుతింపబడినారు.

ఆదిభిక్షువు శంకరుడు, ఆదికవి వాల్మీకి, ఆది గురువు వేదవ్యాసులు.

వ్యాసులవారు రచించిన అష్టాదశ పురాణాలలోని స్కాందపురాణములో గురుమహిమను వెల్లడించునది గురుగీత.

గురుశబ్ధ నిర్వచనము :-

శ్లో॥ గుకారశ్చాన్ధకారోహి రు కారస్తేజ ఉచ్యతే।
అజ్ఞాన గ్రాసకం బ్రహ్మ గురురేవ న సంశయః॥

పై శ్లోకమును శ్రీ దాదన చిన్నయ్యగారు ఈరీతిగ ఆంధ్రీకరించినారు.

తే.గీ. కనుగొన ''గు'' కారమది అంధకారమగును
మరి ''రు'' కారంబు తేజమై పరగుచుండు
అజ్ఞతను బాపునట్టి బ్రహ్మంబె గురువు
సంశయంబేమి లేదిందు సరసిజాక్షి !

సంస్కృతాంధ్రములలో నిష్ణాతులైన చిన్నయ్యగారు శ్రీ గురుగీతలోని 352 శ్లోకములను, సరళము, సుబోధకమగు తేటగీతలలో తెలుగు పాఠకులకు అందజేసిన చరితార్థులు. శ్రీచిన్నయ్యగారిని మనసారా అభినందిస్తున్నాను.

అధ్యాపకులుగా మూడుదశాబ్దములపాటు వేలాది విద్యార్థులను తీర్చిదిద్ది వారి మన్ననలందుకొన్నవారు. ఇది వరకే పలురచనలుచేసి సాహిత్యాభిమానుల ప్రశంసలందుకొన్నారు. వాగ్దేవివారికి దీర్ఘాయురారోగ్యములు ప్రసాదించి మరికొన్ని ఉత్తమ రచనలు చేపట్టునట్లు అనుగ్రహించుగాక.

కడప : 21-7-2000



జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# బృహత్కృషి

పూజ్యులు ''కవిరత్న'' బిరుదాంచితులు విద్వాన్ శ్రీ దాదన చిన్నయ్యగారికి నమస్సుమాంజలులు.

మీ వ్యాసప్రణీత సంస్కృత గురుగీతాగ్రంథాంధ్ర పద్యానువాద రచన చదివి నేను చాల ఆనందించితిని. దాని వలన నేను పొందిన అనుభూతిని ఈ క్రింది విధముగా వ్యక్తపరచినాను. నన్ను ఆశీర్వదించండి.

కం. గురువే బ్రహ్మాయు, విష్ణువు
గురువే పరమేశ్వరుండు గురువే సాక్షాత్
పరమాత్మరూపుడనదగు
గురుగీతను వ్యాసమౌని కూర్మి రచింపన్

తే.గీ. ఆదిశేషున కజునకు హరికి హరున
కలవి కాదు వర్ణింపగ నా గురువరు
మహిమనట్టి బృహత్కృషి మానవాళి
హితము గోరి యనువదించి యిచ్చినారు
తేటతెలుగు పద్యములలో తీపికలిపి

చ. అపరసరస్వతీ తనయులౌ తమరీ ఘనకార్యభారమున్
తపము ఫలించెనా? ననగ తత్త్వవిచారులు మెచ్చునట్లుగా
సఫలమునొంద మోసి సువిచారముతో నెరవేర్చిధన్యులై
విపులయశస్కులై సుకవిభేరిని మ్రోగగజేసినారహో!

సీ. ఏ మహనీయుడు హేయభవాబ్ధిని
తరణియై దాటించ తగినవాడొ
ఏ జ్ఞానభాస్కరుడజ్ఞాన తిమిరంబు
దుర్దాంతతేజమై ద్రోలగలడొ
ఏ గుణాతీతుడు త్రైగుణ్యదైత్యుని
తత్త్వమస్యసిఁ జీల్చి తనరగలడొ
ఏ నిరామయుడు సుజ్ఞానౌషధమున జన్మరుజను వైద్యుడైమాన్పగలడొ

తే.గీ. అట్టి గురుదేవుగీతను గుట్టువిప్పి
ఆంధ్రపద్యానువాదమునందు కూర్చి
తెలుగువారికి విందునందించినారు
మీరు జిజ్ఞాసువులకుపకారులగుచు.

తే.గీ. భాష, ఛందస్సు, పాకము, వ్యాకరణము
శ్లేష, శైలి, శిల్పపదలాలిత్యములను
నేఁ స్పృశించిన అనలమునే స్పృశించు
చందమౌ హనుమంతుని ముందు కుప్పి
గంతులేసినయట్లగు కల్లకాదు.

ఇట్లు
బుధజన విధేయుడు
'కవితాభారతి' సిద్ధేశ్వరం కొల్లప్పకవి,
ఇ.నెం. 17/1075-డి3,
శ్రీ సరస్వతీ విద్యామందిరము రోడ్డు,
గుంతకల్లు.



# ప్రశంస

చిరకాల పరిచితులు సాహితీమూర్తి సాధుస్వభావులు శ్రీ చిన్నయ్యగారంటే సోదరభావం పెల్లుబుకుతుంది. తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాలలో విద్వాన్ విద్యాభ్యాసంనుండి నేటి దనుక ఈ బంధం దృఢంగా నిలిచింది. దీనిని మహద్భాగ్యంగా భావిస్తున్నాను. సాహితీ క్షేత్రమున నిరంతర కవితా కృహీవలుడు మా చిన్నయ్య. దుర్గాంబికా శతకం మొదలుకొని వీరి కవితా కన్యక బహు భంగిమలతో నాట్యం చేస్తూనే వుంది. కసాపురం శ్రీ నెట్టికంటి ఆంజనేయస్వామి సుప్రభాతంతో వీరి జన్మ ధన్యమైంది. ''శ్రీగురుగీత'' ఆంధ్రానువాదంతో వీరి జన్మ గణ్యమైంది.

శివప్రోక్తమైన సంస్కృతంలోని అనుష్టుప్ ఛందో బద్ధమైన శ్రీగురుగీత ఆంధ్ర పద్యానువాదం సరళ సహజ సుందరంగా సాగింది. ఉపదేశం సారళ్యమును సంతరించుకున్నప్పడే బహుజనాభీష్టం, సకల జనామోదం కాగలదు. గురుగీతలో వీరి కవితా ప్రతిభ స్పష్టంగా గోచరమైంది. సన్నిహిత సాహితీ సహచరులకు ఆదర్శప్రాయులు శ్రీ చిన్నయ్యగారు. వీరి నిరంతర కవితా వ్యాసంగానికి నిదర్శనంగా రమణీయ కావ్యాలు రూపుదిద్దుకోగలవని ఆశిస్తున్నాను. వీరికి వీరి కుటుంబ సభ్యులకు సర్వేశ్వరుడు చిరాయురారోగ్య భాగ్యాలను ప్రసాదించాలని ప్రార్థిస్తున్నాను.



సుధీ విధేయుడు

తాడిపత్రి
15-8-2000

**విద్వాన్ మాదన కేశవులు**
విశ్రాంతాంధ్రోపాధ్యాయుడు.

కవిరత్న విద్వాన్ దాదన చిన్నయ్య
విశ్రాంతాంధ్రోపాధ్యాయులు
ఇ.నెం. 17/700-A 1.తిలక్‌నగర్,
గుంతకల్లు - 515 801.
ఫోన్ : 28652.

# కృతజ్ఞతలు

నన్ను ప్రేమతో పెంచి చదువుచెప్పించిన మా జననీ జనకులు కీ॥శే॥ శ్రీమతి సుబ్బమ్మను, శ్రీ బయన్నను, కృపతో, అక్షరములు నేర్పించి నన్ను దీవించిన మా గురుదేవులు శ్రీ నరసింహాచార్యులను స్వర్గస్థులు పుట్లూరు మల్లారెడ్డి, చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మ, గౌరిపెద్ది రామసుబ్బశర్మ గారిని హృదయమున నిరంతరము స్మరింతును.

గ్రంథ రచనయందు నాకు సహకరించిన మా శ్రీ భారతీ సాహితీ సమితి (గుంతకల్లు) సభ్యులకు జోహార్లు. మా విజ్ఞప్తిని పురస్కరించుకొని శ్రీగురుగీతాంధ్రానువాదమును దయతో వీక్షించి ఆశీస్సులు పంపిన పూజ్యపాద శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరానందగిరి స్వాముల (శ్రీవాసవీ పీఠాధిపతులు-బెంగుళూరు) వారికి, శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారికిని భక్తి పూర్వక ప్రణామములు. మా అభ్యర్థననుసరించి తమ అమూల్యమైన అభిప్రాయములను దయతో పంపిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ఆచార్య యన్.గోపి గారికిని, డా॥ జానమద్దిహనుమచ్ఛాస్త్రి (రిటైర్డ్ ఇంగ్లీషు లెక్చరర్) గారికిని, కృతజ్ఞతా పురస్సర నమస్సులు.

శ్రీ గురుగీతాగ్రంథ ముద్రణార్థము ఆర్థిక సహాయము గావించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారికి అభివందనములు. ఈగ్రంథముద్రణకొరకు కొంత ధనమిచ్చిన వదాన్యులు శ్రేష్ఠి శ్రీవంకదారు రామకృష్ణయ్యశ్రేష్ఠిగారికి, నమస్కారములు. మా పుత్రిక శ్రీమతి పద్మావతమ్మ, దౌహిత్రులు చిరంజీవులు మదనమోహనకృష్ణ, రాజేంద్రబాబు; మా కోడలు, కుమారుడు శ్రీమతి కృష్ణవేణమ్మ, శ్రీ మురళీమోహనకృష్ణ, నాసతీమణి శ్రీమతి రామలక్ష్మమ్మ; మిత్రులు శ్రీ జి. పరంధామయ్య గారును శ్రీ గురుగీతా శ్లోకములను చదివి నాకు వినిపించుచు నేనల్లిన అనువాద పద్యములను వ్రాయుచు నాకు తోడ్పడిరి. శ్రీ తమ్మినేని చంద్రశేఖరనాయుడు (గుంతకల్లు యం.బి. హైస్కూలు తెలుగు పండితులు) గారు శుద్ధప్రతిని సుందరముగా సిద్ధముచేసి యిచ్చిరి. సోదర తుల్యులు, ఆత్మీయులు విద్వాన్ శ్రీ మాదనకేశవులు (రిటైర్డ్ తెలుగు పండితులు-తాడిపత్రి) గారు గ్రంథముద్రణ భారమును తమ భుజస్కంధముల మీద వహించుటయేగాక అభిప్రాయమును కూడ అందించిరి. కవితాభారతి శ్రీ సిద్ధేశ్వరం కొల్లప్ప కవిగారు శ్రమకోర్చి పెక్కుమార్లు ప్రూఫులు దిద్ది నాకెంతయో సహకరించుటయేగాక ''బృహత్కృషి'' ని రచించి చేర్చిరి,

సుకవివతంసులు శ్రీ బేతపూడి రాజశేఖరరావు (అసిస్టెంట్ హెడ్ రికార్డ్ ఆఫీసర్ ఆర్.యమ్.యస్. గుంతకల్లు) గారు ''సుజనచరిత'' అను వ్యాసమును చక్కగా సంతరించిరి. అవధాన భారతి, సాహితీచతురానన, విద్వాన్ శ్రీ చక్రాల లక్ష్మీకాంత రాజారావుగారు పరిచయభాగ్యమును కూర్చిరి, తాడిపత్రి సత్యభార్గవి ప్రింటింగ్‌ప్రెస్ యజమానులు శ్రీ దామోదరబాబు గారును, శ్రీ గోవర్ధనబాబుగారును తత్సహాయకులును శ్రీ గురుగీతాగ్రంథమును అందముగా ముద్రించి యిచ్చిరి.

కం. ధ్వాంతంబున కరదీపము
కాంతుల విరజిమ్ము నట్లు కవితలలో నా
కెంతయు తోడ్పడు లక్ష్మీ
కాంతుడు చక్రాల వంశ్యకవి ఆప్తుండై

వీరందరికిని సమస్త శుభములు ప్రసాదింపుమని విశ్వవ్యాపకుడు, విశ్వేశ్వరుడునగు పరమాత్ముని మనసా ప్రార్థించుచున్నాను.

ఆగష్టు
2000



ఇట్లు
విబుధజన విధేయుడు
దాదన చిన్నయ్య

# విషయసూచిక

## ప్రథమాధ్యాయము

# ద్వితీయాధ్యాయము

| క్రమ సంఖ్య | విషయము | పద్య సంఖ్యలు |
|---|---|---|
| 17. | గురుధ్యాన విధానము | 109-119 |
| 18. | గురుదృష్టి ప్రభావము | 120-121 |
| 19. | గురుని గూర్చి త్రిమూర్తులు చెప్పినది | 122-124 |
| 20. | గురూపదేశ ఫలము | 125-129 |
| 21. | గురునిందా దుష్ఫలము | 130 |
| 22. | గురునియెడ శిష్యుడు ప్రవర్తింపవలసిన విధము | 131-148 |
| 23. | గురు, సురల శాప పరిణామము | 149-151 |
| 24. | సన్యాసి లక్షణము | 152-154 |
| 25. | శిష్యుడు స్వరూపజ్ఞతను పొందుట | 155 |
| 26. | ధ్యానింపదగిన సద్గురువర్యుడు | 156-167 |
| 27. | పిండ, పద, రూప, రూపాతీత శబ్ద వివరణ | 168-171 |
| 28. | భగవంతుని షడ్గుణములు | 172 |
| 29. | బ్రహ్మజ్ఞాని లక్షణములు | 173-174 |
| 30. | వేదశాస్త్ర, మంత్ర, మతాదులవలన సౌఖ్యము లేదనుట | 175-176 |
| 31. | మౌని పొందుసౌఖ్యమింద్రాదులకు లభింపదనుట | 177-178 |
| 32. | గురువాక్య ఫలము | 179-181 |
| 33. | నిరాకారుని ధ్యానించుట కష్టము | 182 |
| 34. | గురువే త్రిమూర్తుల విధులు నిర్వహించును | 183 |
| 35. | సాధకుని సమత్వము | 184-186 |
| 36. | ముక్తుని లక్షణము | 187-188 |
| 37. | జ్ఞానరహితుని పూజాదులు వ్యర్థమనుట | 189-195 |
| 38. | సద్గురువు నాశ్రయించుట | 196-197 |
| 39. | వేషధారియగు గురువు | 198-203 |
| 40. | సద్గురు లక్షణములు | 204-205 |
| 41. | గురునికి వస్తు సమర్పణము | 206-207 |
| 42. | నమస్కార ఫలము | 208-210 |
| 43. | గురుగీతా ప్రభావము | 211-218 |
| 44. | గురుగీతా జపమునకు అర్హానర్హాసనములు | 219-221 |
| 45. | గురుగీతాజపమున దిశలొసగు ఫలములు | 222-223 |
| 46. | గురుగీతా పఠన, ధ్యాన, జప ఫలములు | 224-235 |

# తృతీయాధ్యాయము

# తృతీయాధ్యాయము





# శ్రీ గురుగీత

## ప్రథమాధ్యాయము

### .. గురు ప్రార్థన :

శ్లో॥ అచిన్త్యాఽవ్యక్తరూపాయ నిర్గుణాయ గుణాత్మనే ।
సమస్త జగదాధారమూర్తయే బ్రహ్మణే నమః ॥

తే.గీ॥ శ్రీదునకు, నిర్గుణునకు, గుణోదయునకు
మనసునకు దృష్టికందని మహితునకును,
భువనజాల మహాధారమూర్తికేను
వందన మొనర్తు గురు పరబ్రహ్మమునకు 1

. శౌనకాది మునులు గురుగీతను చెప్పుమని సూతమునీంద్రు నడుగుట

ఋషయః ఊచుః

శ్లో॥ సూత! సూత! మహాప్రాజ్ఞ! నిగమాగమపారగ।
గురుస్వరూప మస్మాకం బ్రూహిసర్వమలాపహమ్॥

వ. ఋషులు ఇట్లు పలికిరి.

తే.గీ॥ ఎల్ల వేదాగమంబుల నెఱిగియున్న
సూక్ష్మబుద్ధివి గద నీవు సూతమౌని।
మలములన్నిటి హరియించు మహిమగలుగు
గురుచరిత్రమ్ము మాకిప్పుడెరుగజెపుమ। 2

శ్లో॥ యస్యశ్రవణమాత్రేణ దేహీ దుఃఖాద్విముచ్యతే।
యేన మార్గేణ మునయః సర్వజ్ఞత్వం ప్రపేదిరే॥

తే.గీ॥ దేని విన్నంతమాత్రాన మానవుండు
పుడమి దుఃఖమునుండి తావిడువబడునొ
తపసులేమార్గమును బట్టి తపముచేసి
తాము సర్వజ్ఞతను పొంది ధన్యులైరొ 3

శ్లో॥ యత్ప్రాప్యన పునర్యాతి నరస్సంసారబంధనమ్।
తథావిధం పరం తత్త్వం వక్తవ్యమధునాత్వయా॥

తే.గీ॥ ఏది ప్రాప్తింపగా నరుండింక నెపుడు
భూమిసంసార బంధంబు పొందకుండు
అట్టి పరతత్త్వమును గూర్చి అనఘ। నేడు
మాకు విశదమ్ముగా తెల్పుమా! మునీంద్ర। 4

శ్లో॥ గుహ్యాత్ గుహ్యతమం సారం గురుగీతా విశేషతః।
త్వత్ప్రసాదాచ్ఛ్రోతవ్యా తత్సర్వం బ్రూహిసూతనః॥

తే.గీ॥ అతిరహస్యంబుగద, రహస్యములకంటె,
సారభరితమ్ము, గురుగీత సంయమీంద్ర!
తనరు నీకృపచే వినందగినదిదియు
చెప్పుమదియెల్ల మాకు విశేషముగను 5

3. సూతుడు శౌనకాదిమునులకు గురుగీతను చెప్ప ప్రారంభించుట.

శ్లో॥ ఇతి సంప్రార్థిత స్సూతో మునిసంఘైర్ముహుర్ముహుః।
కుతూహలేన మహతా ప్రోవాచ మధురంవచః॥

తే.గీ॥ శౌనకాదిమునీశ్వరుల్ సారెసారె
కిటుల ప్రార్థింప సూతమునీంద్రుడంత
ఆత్మయందు కుతూహల మతిశయిల్ల
తాను పలికెను పలుకుల తేనెలొలుక 6

సూత ఉవాచ:

శ్లో॥ శృణుధ్వం మునయస్సర్వే శ్రద్ధయా పరయా ముదా।
వదామి భవరోగఘ్నీంగీతాం మాతృస్వరూపిణీమ్॥

వ. సూతుడు పలికెను:

తే.గీ॥ భయద సంసార రోగమ్ముబాపునదియు
మాతృమూర్తి యనందగు గీతనిపుడు
చెప్పుచున్నాడ ఓ మునిశ్రేష్ఠులార!
శ్రద్ధ వినుడందరును కడు సంతసమున 7

4. కైలాసమున పార్వతీదేవి గురుమహిమను గురించి తెలుపుమని పరమేశ్వరుని ప్రార్థించుట.

శ్లో॥ పురాకైలాసశిఖరే సిద్ధగన్ధర్వసేవితే।
తత్రకల్పలతా పుష్పమందిరేఽత్యన్తసున్దరే॥

తే.గీ॥ పూర్వమొకనాడు కైలాసభూధరమున
సిద్ధగంధర్వ కిన్నరసేవితమ్ము
లలితకల్పలతాసుమాలంకృతమ్ము
నయిన సుందర మందిరాభ్యంతరమున 8

శ్లో॥ వ్యాఘ్రాజినే సమాసీనం శుకాది మునివందితం।
బోధయంతం పరంతత్త్వం మధ్యేమునిగణంక్వచిత్॥

తే.గీ॥ శ్రీశుకాదిమునుల్ నమస్కృతులొనర్ప
భక్తితత్పరులగు మౌనివరులనడుమ
చెలగు వ్యాఘ్రాజినమున నాశీనుడగుచు
పరమ తత్త్వమ్ము బోధించు తరుణమందు 9

శ్లో॥ ప్రణమ్రవదనా శశ్వన్నమస్కుర్వన్తమాదరాత్।
దృష్ట్వావిస్మయమాపన్నా పార్వతీ పరిపృచ్ఛతి॥

తే.గీ॥ మాటికాదరమొప్ప నమస్కరించు
శంకరుని చూచి మిగులనాశ్చర్యమంది
పార్వతీదేవి ప్రశ్నించె పలుకునందు
మోమునందును వినయంబు మోసులెత్త 10
శ్రీపార్వత్యువాచ

శ్లో॥ ఓం నమోదేవ! దేవేశ! పరాత్పర! జగద్గురో।
త్వాం నమస్కుర్వతే భక్త్యాసురాసురనరాస్సదా॥

వ. పార్వతి పలికెను.

తే.గీ॥ ఓ పరాత్పర! ఓంకారరూప! దేవ
ఓజగద్గురు! వందనమో మహేశ!
జీవితేశ! నమస్కరించెదరు మీకు
నిరతమును భక్తితో సురాసురులు నరులు 11

శ్లో॥ విధివిష్ణుమహేంద్రాద్యైర్వంద్యః ఖలు సదా భవాన్।
నమస్కరోషికస్మైత్వం నమస్కారాశ్రయఃకిల॥

తే.గీ॥ బ్రహ్మవిష్ణువులకు దేవపతికి సతము
వంద్యులగుదురుగద మీరు వామదేవ!
అహో! నమస్సులకాశ్రయమగుచునిపుడు
మరియెవరికిట్లు మ్రొక్కుచుంటిరి గిరీశ! 12

శ్లో॥ దృష్ట్వైతత్కర్మ విపుల మాశ్చర్యం ప్రతిభాతిమే।
కిమే తన్నవిజానేఽహం కృపయా వద మేప్రభో॥

తే.గీ॥ మీరుచేసెడు నీనమస్కారకర్మ
అరయ మిక్కిలి నాశ్చర్యమయ్యెనాకు
దీనికింగారణంబేదొ తెలియదయ్యె
తెలుపుమీసంగతింగృపదివిజ వినుత! 13

శ్లో॥ భగవన్! సర్వధర్మజ్ఞ! వ్రతానాం వ్రతనాయకమ్।
బ్రూహి మే కృపయా శమ్భో! గురుమాహాత్మ్యముత్తమమ్॥

తే.గీ॥ సర్వధర్మజ్ఞ! భగవంత! చంద్రమౌళి!
వ్రతములందుత్తమోత్తమ వ్రతమనంగ
వెలయు సద్గురు మహిమంబు విపులముగను
కరుణతో నాకు చెప్పుము గరళకంఠ! 14

శ్లో॥ కేనమార్గేణ భోస్వామిన్! దేహీబ్రహ్మమయోభవేత్।
తత్కృపాంకురుమేస్వామిన్! నమామి చరణౌతవ॥

తే.గీ॥ అభవ! తానెట్టిమార్గమ్మునసుసరించి
దేహిబ్రహ్మమయుండయి తేజరిలునొ
దాని నెఱిగింపుమా నాకు దయ వహించి
స్వామి మ్రొక్కెద నీపాద పద్మములకు 15

5. ఈశ్వరుడు గురుమహిమను గూర్చి పార్వతీదేవికి వివరించుట.

శ్లో॥ ఇతి సంప్రార్థితశ్శశ్వన్మహాదేవో మహేశ్వరః।
ఆనందభరిత స్వాంతః పార్వతీ మిదమబ్రవీత్॥

తే.గీ॥ అనుచు పలుమారులీరీతి అద్రితనయ
తన్నుప్రార్థింపగా చంద్రధరుడు హరుడు
శర్వుడానందపూరితస్వాంతుడగుచు
అయమను గాంచి పల్కె నిట్లుచితముగ 16

శ్రీ మహాదేవ ఉవాచ:

శ్లో॥ నవక్తవ్య మిదందేవి! రహస్యాతిరహస్యకమ్।
నకస్యాపి పురాప్రోక్తం త్వద్భక్త్యర్థం వదామితత్॥

తే.గీ॥ అతిరహస్యంబు సుమి! రహస్యముల నిద్ది
కాన వచియింపజాలను దీని దేవి!
లేమ! మున్నెవ్వరికి చెప్పలేదు నేడు
నీదు భక్తికి మదిమెచ్చినే వచింతు. 17

శ్లో॥ మమ రూపాసిదేవి! త్వమత స్తత్కథయామి తే।
లోకో పకారః ప్రశ్నోయం, నకేనాపికృతః పురా॥

తే.గీ॥ పడతి!జగతికి మేలొసేయు ప్రశ్నయిద్ది
అతివ! మున్నెన్నడును దీనినడుగరెవరు
నీవు నారూపమేగాన నీకుదేవి!
ఈ రహస్యంబు నెరిగింతునింపుమీర 18

శ్లో॥ యస్యదేవేపరాభక్తిః యథాదేవే తథాగురౌ।
తస్యైతేకథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః॥

తే.గీ॥ దైవమును గొల్చినట్టులే తనదు గురువు
నచల భక్తి భజించు గుణాధికుండు
శాస్త్రములు చెప్పు సదమలాంశములనెల్ల
ఎట్టి శ్రమయును లేకగ్రహింపగలడు 19

శ్లో॥ యోగురుః సశివఃప్రోక్తోయః శివః స గురుఃస్మృతః।
వికల్పం యస్తు కుర్వీత సనరోగురుతల్పగః॥

తే.గీ॥ గురుడె శివుడంచు, శివుడె సద్గురుడటంచు
మించు శాస్త్రంబులెల్ల ఘోషించుచుండె
శివుడు గురుడును వేరని చెప్పునట్టి
నరుడు గురుతల్పగునివోలె దురితమొందు 20

శ్లో॥ దుర్లభం త్రిషులోకేషు తచ్ఛృణుష్వవదామ్యహమ్।
గురుఃబ్రహ్మవినా నాన్యః సత్యం సత్యం వరాననే॥

తే.గీ॥ ఎల్లలోకాలలో లభియింపనట్టి
విషయమును తెల్పుచున్నాడ వినుము నీవు!
గురువు బ్రహ్మంబుకంటెను పరుడుకాడు
ఇదియె సత్యంబు, సత్యమోయిందు వదన! 21

6. గురుభక్తి లేక జపాదుల వలన ఫలము లభింపదనుట:–

శ్లో॥ వేదశాస్త్రపురాణాని చేతిహాసాదికానిచ।
మంత్రయంత్రాది విద్యాశ్చమోహనోచ్చాటనాదికమ్॥

తే.గీ॥ రమణిరో! వేదశాస్త్రపురాణములును,
మరియు నితిహాసకథలును, మంత్రయంత్ర
సహిత విద్యలు మోహనోచ్చాటనాది
వివిధ విద్యలు లోకాన వెలయుచుండు 22

శ్లో॥ శైవ శాక్తాగమాదీని హ్యన్యేచ బహవోమతాః।
అపభ్రంశాస్సమస్తానాం జీవానాం భ్రాంతచేతసామ్॥

తే.గీ॥ అతివ విను! శైవశాక్తాగ మాదులితర
బహుమతాలున్నయవి, గురుభక్తిలేక
భ్రాంత చేతస్కులగుచు జీవనము చేయు
అఖిల మనుజుల కివియేవి అందవెపుడు 23

శ్లో॥ జపస్తపోవ్రతం తీర్థం యజ్ఞోదానం తథైవచ।
గురుతత్త్వ మవిజ్ఞాయ సర్వం వ్యర్థం భవేత్ప్రియే॥

తే.గీ॥ గురుని తత్త్వమ్ము బాగుగా నెరుగకున్న
ప్రతిదినముజేయు జపము, తపమ్ము, వ్రతము
యజ్ఞమును, దానమును తీర్థయాత్రలివ్వి
యన్నియును నిష్ఫలంబులేయగును సుమ్ము 24

గురుపాదసేవా, నామ కీర్తన ఫలములు:-

శ్లో॥ గురుబుద్ధ్యాఽఽత్మనో నాన్యత్ సత్యం సత్యం వరాననే।
తల్లాభార్థం ప్రయత్నస్తు కర్తవ్యశ్చమనీషిభిః॥

తే.గీ॥ ఆత్మకంటెను లేదన్యమనుచు గురుని
కరుణవలన నెరుంగుటే పరమసత్య
మిట్టి జ్ఞానము పడయుటకే వివేకి
యత్నమొనరింపదగును నిత్యమ్ముదేవి! 25

శ్లో॥ గూఢావిద్యా జగన్మాయా దేహశ్చాజ్ఞాన సంభవః।
విజ్ఞానం యత్ప్రసాదేన గురుశబ్దేన కథ్యతే॥

తే.గీ॥ మగువరొ! అవిద్యయే జగన్మాయ యనియు,
దేహమజ్ఞానమున పుట్టి తీరుననియు
నెరుగ దగుశక్తి యేఘను కృపలభించు?
అట్టి మహనీయునే గురువండ్రు బుధులు 26

శ్లో॥ యదంఘ్రి కమల ద్వంద్వం ద్వంద్వ తాపనివారకమ్।
తారకం భవసింధోశ్చతం గురుం ప్రణమామ్యహమ్॥

తే.గీ॥ తరుణి! యెవ్వరి పాదపద్మద్వయమ్ము
ద్వంద్వ తాపమహార్తి నివారకమ్ము
ఘోర సంసార సాగర తారకమ్ము
అట్టి గురునికి వందనమాచరింతు 27

శ్లో॥ దేహీబ్రహ్మభవేద్యస్మాత్ త్వత్కృపార్థం వదామి తత్।
సర్వపాప విశుద్ధాత్మా శ్రీగురోః పాదసేవనాత్॥

తే.గీ॥ శ్రీగురుని పాదసేవలు చేయుకతన
అఖిల పాపంబులను బాసి అమలుడగుచు
దేహితాబ్రహ్మమయ్యెడు తెరగునీకు
కరుణతో తెల్పెదను విను కమల నయన! 28

శ్లో॥ సర్వతీర్థావగాహస్య సంప్రాప్నోతిఫలం నరః।
గురోః పాదోదకం పీత్వాశేషంశిరసి ధారయన్॥

తే.గీ॥ గురుని పాదోదకంబులు గ్రోలి పిదప
శేషమును భక్తి శిరమున జేర్చునరుడు
సర్వతీర్థాల స్నానంబు సలుపు కతన
వచ్చు ఫలమును బొందును వనరుహాక్షి! 29

శ్లో॥ శోషణం పాపపఙ్కస్య దీపనం జ్ఞానతేజసః।
గురోఃపాదోదకం సమ్యక్ సంసారార్ణవ తారకమ్॥

తే.గీ॥ ఓ వరానన! గురుని పాదోదకంబు
పాపమను పంకమెండిపోవంగజేయు,
జ్ఞాన తేజంబు మిగుల నెసంగజేయు
తడవుసేయక భవవార్థిదాటజేయు 30

శ్లో॥ అజ్ఞానమూల హరణం జన్మకర్మనివారకమ్।
జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం గురోః పాదోదకం పిబేత్॥

తే.గీ॥ అమల గురుపాద జలపానమాచరింప
జగతి దుఃఖదమైన యజ్ఞానమడగు,
జన్మలకు హేతువగు కర్మచయము తొలగు,
జ్ఞాన వైరాగ్యసిద్ధియౌ మానవునకు 31

శ్లో॥ గురుపాదోదకం పానం గురోరుచ్ఛిష్ట భోజనమ్।
గురుమూర్తే స్సదా ధ్యానం గురోర్నామ సదాజపః॥

తే.గీ॥ గురుని పాదోదకంబులు గ్రోలుచుంట,
గురువొసంగు ప్రసాదంబు గొనుచునుంట
నిరతి గురుమూర్తి నెపుడు ధ్యానించుచుంట,
విడక గురునామ జపముగావించుచుంట,
ఇవ్వి శ్రేయస్కరంబులు పువ్వుబోణి! 32

శ్లో॥ స్వదేశికస్యైవచ నామకీర్తనం భవేదనంతస్యశివస్యకీర్తనమ్।
స్వదేశికస్యైవచ నామచింతనం భవే దనంతస్యశివస్యచింతనమ్॥

తే.గీ॥ తనదు గురుదేవు నామకీర్తనమనంతు
డగు శివుని నామ కీర్తనమగును గాదె,
తనదు గురుదేవునామ చింతనమనంతు
డగు శివుని నామ చింతన మగునుగాదె 33

శ్లో॥ యత్పాదాంబుజరేణుర్వైకో౽పి సంసారవారిధౌ।
సేతుబంధాయతే నాథం దైశికం తము పాస్మహే॥

తే.గీ॥ ఉవిద! ఎవ్వరి పదరేణు వొక్కటైన
భయద సంసార గంభీర వార్ధిదాటి
పారమును జేరుటకు సేతు బంధమగునో
అట్టి గురువును పాసింతు అతులభక్తి 34

శ్లో॥ యదనుగ్రహ మాత్రేణశోక మోహౌ వినశ్యతః।
తస్మైశ్రీ దేశికేంద్రాయ నమో౽స్తు పరమాత్మనే॥

తే.గీ॥ ఇంతి! ఎవ్వరనుగ్రహ మింతజూపి
నంతనే శోకమోహాలు హతములగునొ
అట్టి గురు పరమాత్మున కమల భక్తి
మాటి మాటికి నేను నమస్కరింతు 35

శ్లో॥ యస్మాదనుగ్రహం లబ్ధ్వా మహదజ్ఞాన ముత్సృజేత్।
తస్మైశ్రీదేశికేంద్రాయ నమశ్చాభీష్టసిద్ధయే॥

తే.గీ॥ అతివ! యెవ్వరి సదనుగ్రహమ్ము పొంది
శిష్యుడజ్ఞానము నశింపజేసికొనునొ
అట్టిశ్రీదేశికేంద్రున కమల భక్తి
చేయుదును వందనమభీష్ట సిద్ధికొఱకు 36

8. గురునివాసస్థలాదుల వర్ణన :-

శ్లో॥ కాశీక్షేత్రం నివాసశ్చ జాహ్నవీ చరణోదకం।
గురుర్విశ్వేశ్వరస్సాక్షాత్ తారకం బ్రహ్మనిశ్చయః॥

తే.గీ॥ శ్రీగురుండున్న నెలవె కాశీ స్థలంబు,
దేశికుని పాదతోయమే, దివ్యగంగ,
ఈ గురుండె ప్రత్యక్ష విశ్వేశ్వరుండు,
బ్రహ్మనిశ్చయ మదియె తారకముదేవి! 37

శ్లో॥ గురుసేవా గయా ప్రోక్తాదేహస్స్యా ద క్షయోవటః।
తత్పాదం విష్ణుపాదంస్యాత్ తత్రదత్త మనస్తతమ్॥

తే.గీ॥ శ్రీగురుని సేవయే గయాక్షేత్రమగును,
వీరిదేహమె స్థిరవట వృక్షమగును,
గురుని చరణమ్మె శ్రీవిష్ణు చరణమగును,
స్వామి కర్పించు చిత్తమే బ్రహ్మమగును 38

శ్లో॥ గురుమూర్తింస్మరేన్నిత్యం గురోర్నామ సదా జపేత్।
గురోరాజ్ఞాం ప్రకుర్వీత గురోరన్యన్నభావయేత్॥

తే.గీ॥ శ్రీ గురూత్తము నెపుడు స్మరింపవలయు
ప్రీతి తన్నామ మెపుడు జపింపవలయు,
తప్పక తదాజ్ఞలను తలదాల్పవలయు,
తక్కినవి వీడి గురువునే తలపవలయు 39

శ్లో॥ గురువక్త్రే స్థితం బ్రహ్మప్రాప్యతే తత్ప్రసాదతః।
గురుర్ధ్యానం సదాకుర్యాత్ పురుషంస్వైరిణీయథా॥

తే.గీ॥ జ్ఞానముండును గురు వదనంబునందు
గురువరేణ్యుని కృపనది నరుని కబ్బు
వరుని జారిణి తలచిన కరణి, ధరణి
నిశ్చలమ్ముగ గురుని ధ్యానింపవలయు 40

శ్లో॥ స్వాశ్రమంచ స్వజాతించ స్వకీర్తిం పుష్టివర్ధనమ్।
ఏతత్సర్వం పరిత్యజ్య గురుమేవ సమాశ్రయేత్॥

తే.గీ॥ తనదునాశ్రమమును మరి తనదుజాతి
తనదు కీర్తిని తన పదార్థ ప్రసక్తి
నితరలోక సుఖంబులనెల్ల విడిచి
ఎలమి గురువర్యునే ఆశ్రయింపవలయు 41

శ్లో॥ అనన్యాశ్చింతయంతోయే సులభం పరమం సుఖమ్।
తస్మాత్సర్వప్రయత్నేన గురోరారాధనం కురు॥

తే.గీ॥ దేశికు ననన్యభక్తి చింతించువారు
పరమ సుఖమొందెదరు సులభముగ నిజము
కాన సర్వప్రయత్నము పూనిచేసి
సద్గురూత్తము పరిచర్యసలుపవలయు 42

శ్లో॥ గురువక్త్రే స్థితా విద్యాగురు భక్త్యాచలభ్యతే।
త్రైలోక్యేస్ఫుటవక్తారో దేవర్షిపితృమానవాః॥

తే.గీ॥ పరమ గురుముఖ మందున్న బ్రహ్మవిద్య
గురువునెడ, గల్గుభక్తిచే నరుడు పొందు,
త్రిజగములనుండు, నరపితృదేవమునులు
విశదముగ, దెల్పుచుండిరీవిషయములను 43

I. గురుశబ్ద నిర్వచనము :-

శ్లో॥ గుకారశ్చాన్ధకారోహి రుకారస్తేజ ఉచ్యతే।
అజ్ఞాన గ్రాసకం బ్రహ్మగురురేవన సంశయః॥

తే.గీ॥ కనుగొన ''గు''కార మది అంధకారమగును
మరి ''రు''కారంబు తేజమై పరగుచుండు
అజ్ఞతను బాపునట్టి బ్రహ్మంబె గురువు
సంశయంబేమి లేదిందుసరసిజాక్షి! 44

శ్లో॥ గుకారశ్చాంధకారస్తురుకారస్తన్నిరోధకృత్।
అంధకార వినాశిత్వాద్గురు రిత్యభిధీయతే॥

తే.గీ॥ కనుగొన గుకార మది అంధకారమగును
దీనిని రుకారమది నిరోధించుచుండు
చిమ్మచీకట్ల నశియింపజేయుకతన
గురువనుచు బిల్చెదరు దేశికుని భవాని! 45

శ్లో॥ గుకారశ్చ గుణాతీతో రూపాతీతో రుకారకః।
గుణరూప విహీనత్వాద్గురురిత్యభిధీయతే॥

తే.గీ॥ కూడదు గుకార మెన్నడు గుణము తోడ,
చేరదది రూపుతోడ రుకారమెపుడు,
గుణము రూపము రెండును తనకులేమి
గురువనుచు పిల్చెదరు దేశికుని లతాంగి 46

శ్లో॥ గుకారః ప్రథమో వర్ణః మాయాది గుణభాసకః।
రుకారోఽస్తి పరంబ్రహ్మమాయా భ్రాంతి విమోచకమ్॥

తే.గీ॥ ప్రథమమగు నక్షరము గుకారమ్ము ప్రబలు
మాయ భ్రాంతిని తెలియగా జేయుచుండు
అదె రుకారంబు రెండవ యక్షరంబు
మాయ భ్రాంతిని దూరంబుసేయుచుండు 47

శ్లో॥ ఏవంగురుపదం శ్రేష్ఠం దేవానామపి దుర్లభమ్।
హాహా హూహూ గణైశ్చైవ గంధర్వాద్యైశ్చపూజితమ్॥

తే.గీ॥ గురుపదంబిట్లు శ్రేష్ఠమై పరగునిద్ది
అమరులకుగూడ దుర్లభమగుచు వెలయు
గరుడ గంధర్వ సిద్ధ కిన్నరులు దీని
అంచితంబుగ భక్తి పూజించుచుంద్రు 48

గురు సేవా విధానము.

శ్లో॥ ధ్రువంతేషాంచ సర్వేషాం నాస్తి తత్త్వం గురోఃపరమ్।
గురోరారాధనం కుర్యాత్ సజీవత్వం నివేదయేత్॥

తే.గీ॥ అరయ నందరికిని వర గురువు కంటె
పరమ తత్త్వమ్ములేదను పలుకు నిజము
గురువరేణ్యుని నిరతంబు కొలువ వలయు
త్రికరణంబుల భక్తి నర్పింప వలయు 49

శ్లో॥ ఆసనం శయనం వస్త్రం వాహనం భూషణాదికమ్।
సాధకేన ప్రదాతవ్యం గురుసంతోషకారణమ్॥

తే.గీ॥ ఆసనంబును శయనంబు నంబరంబు
వాహనంబును, భూషలు పరమభక్తి
సాధకుండగు శిష్యుడొసంగ వలయు
గురువునకు సంతసంబు చేకూర్చుకొరకు 50

శ్లో॥ కర్మణా మనసావాచా సర్వదా ఉ_ఉ_రాధయేద్గురుమ్।
దీర్ఘదండం నమస్కృత్యనిర్లజ్జో గురుసన్నిధౌ॥

తే.గీ॥ గురుని సన్నిధి అభిమాన పరత విడిచి
దీర్ఘదండ ప్రణామంబు తెగువజేసి
త్రికరణంబుల సద్గురుదేవునకును
సతము శిష్యుండు సేవలు సలుపవలయు 51

శ్లో॥ శరీరమింద్రియం ప్రాణ మర్థస్వజనబాంధవాన్।
ఆత్మదారాదికం సర్వం సద్గురుభ్యోనివేదయేత్॥

తే.గీ॥ తన తనువు, నింద్రియంబుల, తనధనంబు
తనదు ప్రాణంబులను, బంధుజన చయమ్ము,
తన జనమ్మును శిష్యుండు వినయమొప్ప
దేశికోత్తమునకు నివేదింపవలయు 52

శ్లో॥ గురురేకో జగత్సర్వం బ్రహ్మవిష్ణుశివాత్మకమ్।
గురోఃపరతరంనాస్తి తస్మాత్సంపూజయేద్గురుమ్॥

తే.గీ॥ అజహరి శివాత్మకంబయి అలరునట్టి
జగము సర్వమ్ము గురుదేవుడగును నిజము
దేశికుడు కాని దెందు నేదియునులేదు
కాన పూజింపవలయు ఆఘనుని సతము 53

శ్లో॥ సర్వశ్రుతిశిరోరత్న విరాజిత పదాంబుజమ్।
వేదాంతార్థ ప్రవక్తారం తస్మాత్సంపూజయేద్గురుమ్॥

తే.గీ॥ ధాత్రి నుపనిషదమల రత్నముల వలన
చరణ సరసీజములు కడు మెరయుచుండ
భూరి వేదాంత తత్త్వంబు బోధసేయు
పరమ గురువును పూజింపవలయు నరుడు 54

శ్లో॥ యస్య స్మరణమాత్రేణ జ్ఞానము త్పద్యతేస్వయమ్।
స ఏవ సర్వసంపత్తిః తస్మాత్ సంపూజయేద్గురుమ్॥

తే.గీ॥ మదినెవరి సంస్మరించిన మాత్రముననె
మనుజునకు జ్ఞానమొదవునో తనకు తానె
అన్నిసంపదలును తానెయైనదెవరొ
అట్టి గురువును పూజించుటర్హమగును 55

11. హేయ శరీర వివరణము :-

శ్లో॥ క్రిమికోటిభిరావిష్టం దుర్గంధ మలమూత్రకమ్।
శ్లేష్మరక్త త్వచా మాంసైర్నద్ధమ్ చైతద్వరాననే॥

తే.గీ॥ పలుతెరంగుల క్రిములకు నిలయమగుచు,
ధాత్రి దుర్గంధ మలమూత్ర ధామ మగుచు,
శ్లేష్మ రక్తమాంసాదులు చేరియుండు
ఈశరీరంబు హేయమో ఇందువదన! 56

శ్లో॥ సంసార వృక్ష మారుఢాః పతంతి నరకార్ణవే।
యస్తా నుద్ధరతే సర్వాం స్తస్మై శ్రీ గురవే నమః॥

తే.గీ॥ వితత భీకర సంసార వృక్షమెక్కి
నరక సాగర మున బడు నరులనెల్ల
ఏమహితుడుద్ధరించునో ఎసగు కరుణ
అట్టి గురుదేవునకు నతులాచరింతు 57

గురువు త్రిమూర్తి, పరబ్రహ్మ స్వరూపుడు :-

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః॥

ఆ.వె॥ గురువరుండు బ్రహ్మ, గురువుశ్రీవిష్ణువు
గురు మహేశయుండు పరమశివుడు
సద్గురూత్తముండు సాక్షాత్పరాత్పరు
డట్టి గురువరేణ్యు నభినుతింతు 58

శ్లో॥ అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ నగజ! అజ్ఞాన తిమిరాంధు నయనములకు
పొలుచుజ్ఞానంపు గాటుక పుడకచేత
వెలుగు సమకూర్చి యెవ్వారు వెలయువారొ
అట్టి గురుదేవునకు నతులాచరింతు 59

శ్లో॥ అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరమ్।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ మండలాకృతి తోడ అఖండమైన
ఈచరాచర జగతి యిట్టెవరి వలన
వ్యాప్తమగుచుండు, ఆపరాత్పరుని పదము
ఏ పవిత్ర చరిత్రుండు చూపగలడొ
అటి గురుదేవునకు నతులాచరింతు 60

13. తత్త్వమసి, అహంబ్రహ్మోస్మి, నాదబిందు కళలు :-

శ్లో॥ స్థావరం జంగమం వ్యాప్తంయత్కించిత్సచరాచరమ్।
త్వం పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవేనమః॥

తే.గీ॥ జంగమస్థావరాత్మక సర్వజగతి
వ్యాప్తమొనరించు అపరబ్రహ్మమరయ
త్వమ్మను పదస్వరూపాన తనరుచుండు
ననుచు సత్కృపతోడనే ఘనుడు తెలుపు
అట్టి గురుదేవునకు నతులాచరింతు 61

శ్లో॥ చిన్మయం వ్యాపితం సర్వంత్రైలోక్యంచ చరాచరమ్।
అసిత్వం దర్శితంయేన తస్మై శ్రీ గురవేనమః॥

తే.గీ॥ అఖిలజగతిని త్రైలోక్యమనెడు పేర
చెలగి వ్యాపింప జేసెడు చిన్మయునకు
నున్న త్వంపద తత్పదాలోకటెయనగ
అసి పదంబున చూపు మహాత్ముడెవరొ
అట్టి గురుదేవునకు నతులాచరింతు 62

శ్లో॥ నిమిషాన్ని మిషార్థాద్వాయద్వాక్యాద్వైవిముచ్యతే।
స్వాఽఽత్మానంశివమాలోక్యతస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ సాధకుండొక్క క్షణము నిశ్చలతమెరయ
భవ్య గురుబోధ వినుచు శుభంబుగూర్చు
బ్రహ్మమే తాననెడు బుద్ధిపడయు నటుల
ఏయపార కృపామతి ఎరుగజెప్పు
అట్టి గురుదేవునకు నతులాచరింతు 63

శ్లో॥ చైతన్యం శాశ్వతం శాంతం వ్యోమాతీతం నిరంజనమ్।
నాదబిందు కళాతీతం తస్మై శ్రీ గురవేనమః॥

తే.గీ॥ జ్ఞానరూపుడు శాంతుడు శాశ్వతుండు
గగనమును మించు ఘనుడు నిష్కల్మషుండు
నాదబిందు కళాతీత నాయకుండు
నయిన గురుదేవునకు నతులాచరింతు 64

14. గురుస్వరూపము – మహిమ :-

శ్లో॥ నిర్గుణం నిర్మలం శాంతం జంగమం స్థిరమేవ చ।
వ్యాప్తం యేన జగత్సర్వం తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ నిర్గుణుండును శాంతుండు నిర్మలుండు
స్థిరతనుండెడు వాడును తిరుగువాడు
విశ్వమంతటి వ్యాప్తిగావించువాడు
అయిన గురుదేవునకు నతులాచరింతు 65

శ్లో॥ స పితా స చ మే మాతా స బంధుః స చ దేవతా।
సంసారమోహనాశాయ తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ గురువె తల్లియు, తండ్రియు గురువె నిజము
గురువె బంధువు, దైవంబు గురువె నాకు
అమిత సంసార మోహంబు నణచివేయు
నట్టి గురుదేవునకు నతులాచరింతు 66

శ్లో॥ యత్సత్త్వేన జగత్సత్త్వం యత్ప్రకాశేన భాతి తత్।
యదానందేన నందంతి తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ ఎవరి సత్వాన సత్వమై యెసగు జగతి,
ఎవరి వెలుగున వెలుగునో యెల్ల సృష్టి
ఎవరి ఆనంద మానంద మిచ్చు ప్రజకు
అట్టి గురుదేవునకు నతులాచరింతు 67

శ్లో॥ యస్మిన్ స్థిత మిదం సర్వం భాతి యద్భాసరూపతః।
యత్ప్రీత్యా ప్రియం పుత్రాది తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ ఎవడు తనయందు నుండిన యెల్లజగతి
స్వీయ తేజమ్ముచే ప్రకాశింపజేయు
ఎవని సంప్రీతి సంతతికిచ్చు ప్రీతి
అట్టి గురుదేవునకు నతులాచరింతు 68

శ్లో॥ యేనేదం దర్శితం తత్త్వం చిత్తచైత్యాదికం తథా।
జాగ్రత్స్వప్న సుషుప్త్యాది తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ వసుధ, జాగ్రదవస్థ, స్వప్నము, సుషుప్తి
చిత్తము, మనస్సు, భాసిల్ల జేయుచున్న
తత్పరబ్రహ్మమును చూపుధన్యులెవరొ
అట్టి గురుదేవునకు నతులాచరింతు 69

శ్లో॥ యస్యజ్ఞానమిదం విశ్వం నదృశ్యం భిన్నభేదతః।
సదైక రూపరూపాయ తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ ఎవరిజ్ఞానముచే విశ్వమెట్టి భిన్న
భేదములు లేనిదగుచు కన్పించుచుండు
ఎవడు బ్రహ్మస్వరూపుడై యెపుడు తనరు
అట్టి గురుదేవునకు నతులాచరింతు 70

శ్లో॥ యస్యజ్ఞాతం మతం తస్య మతం యస్య న వేదసః।
అనన్యభావభావాయ తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ అందరి స్వరూపముల బ్రహ్మమలరుగాన,
బ్రహ్మమునెరుంగుదు నటన్న పలుకు కల్ల
తానె బ్రహ్మము ననుచునే జ్ఞాని యెరుగు
అట్టి గురుదేవునకు నతులాచరింతు 71

శ్లో॥ యస్మై కారణరూపాయ కార్యరూపేణ భాతి యత్।
కార్యకారణరూపాయ తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ బ్రహ్మమే కారణంబు కార్యంబు నగును
తానె విశ్వంబు తానె తత్కారణంబు
ఆ పరాత్పర రూపుడే యలఘుడగును
అట్టి గురుదేవునకు నతులాచరింతు. 72

శ్లో॥ నానారూప మిదం విశ్వం నకేనాప్యస్తి భిన్నతా।
కార్యకారణరూపాయ తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ వివిధ రూపాల కనిపించు విశ్వమెల్ల
నేకమైయుండు భిన్నమింతేని గాదు
కార్యకారణ రూపుడౌ ఘనుడెవండొ
అట్టి గురుదేవునకు నతులాచరింతు 73

శ్లో॥ జ్ఞానశక్తి సమారూఢ తత్త్వమాలా విభూషిణే।
భుక్తిముక్తి ప్రదాత్రేచ తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ స్వస్వరూపాత్మక జ్ఞానశక్తియుతుడు
తత్త్వమను పుష్పమాలికాధరుడు, మరియు
భుక్తిముక్తి ప్రదాతయై పొలుచునెవ్వ
డట్టి గురుదేవునకు నతులాచరింతు 74

శ్లో॥ అనేకజన్మసంప్రాప్త కర్మబంధ విదాహినే।
జ్ఞానానల ప్రభావేన తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ ధరణి బహుజన్మలందు ప్రాప్తంబులగుచు
కర్మబంధాలనన్నింటి జ్ఞానమనెడు
అగ్నిచే దగ్ధమొనరించు ననఘుడెవరొ
అట్టి గురుదేవునకు నతులాచరింతు 75

శ్లో॥ శోషణం భవసింధోశ్చ దీపన ంక్షరసంపదాం।
గురోః పాదోదకం యస్య తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ ఏదయానిధి దివ్యపాదోదకమున
పొంగు భవవారినిధియెండి పోవగలదొ
శిష్యసంపదలభివృద్ధి చెందగలవొ
అట్టి గురుదేవునకు నతులాచరింతు 76

శ్లో॥ న గురోరధికం తత్త్వం న గురో రధికం తపః।
నగురోరధికం జ్ఞానం తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ ధరగురూత్తము మించు తత్త్వమ్ములేదు
పరమగురువును మించు తపమ్ములేదు
సద్గురువుమించు జ్ఞానమెచ్చటనులేదు
అట్టిగురుదేవునకు నతులాచరింతు 77

శ్లో॥ మన్నాథ శ్రీజగన్నాథో మద్గురు శ్రీజగద్గురుః।
మమా ఉ_త్మాసర్వభూతాత్మా తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ అల జగన్నాథుడే నాథుడగును నాకు,
ఆ జగద్గురువే గురువగును నాకు,
అఖిల భూతాత్మయే ఆత్మయగును నాకు,
అట్టి గురుదేవునకు నతులాచరింతు 78

శ్లో॥ గురురాదిరనాదిశ్చ గురుః పరమదైవతమ్।
గురుమంత్ర సమోనాస్తి తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ గురువె ఆది, అనాదియు గురువెయగును,
పరమ దైవత మా గురువరుడెయగును,
సద్గురుని మంత్రమునకేది సాటిరాదు
అట్టి గురుదేవునకు నతులాచరింతు 79

శ్లో॥ ఏక ఏవ పరో బంధు ర్విషమే సముపస్థితే।
గురుస్సకల ధర్మాత్మా తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ కష్టములు సంభవించిన కాలమందు,
పరమ బంధువుగా నిల్చు గురువొకండె
అఖిల ధర్మాత్ముడై గురువలరుచుండు
అట్టి గురుదేవునకు నతులాచరింతు 80

శ్లో॥ గురుమధ్యేస్థితం విశ్వం విశ్వమధ్యే స్థితో గురుః।
గురుర్విశ్వం నచాన్యోఽస్తి తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ విశ్వము గురూత్తమునియందు వెలయుచుండు
గురువు విశ్వమునందు తా పరగుచుండు
గురువె విశ్వంబు విశ్వమే గురువుసుమ్మి
అట్టి గురుదేవునకు నతులాచరింతు 81

శ్లో॥ భవారణ్య ప్రవిష్టస్య దిఙ్మోహ భ్రాంతచేతసః।
యేన సందర్శితం పంథాః తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ భవమహారణ్యమునజొచ్చి భ్రాంతినొంది
దిక్కుతెలియక దుఃఖించు దీనులకును
మార్గమును జూపి రక్షించు మాన్యుడెవరొ
అట్టి గురుదేవునకు నతులాచరింతు 82

శ్లో॥ తాపత్రయాగ్ని తప్తానా మశాంతప్రాణినాం ముదే।
గురురేవ పరాగంగా తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ ధాత్రి తాపత్రయాగ్ని సంతప్తులగుచు
శాంతిగోల్పోయి చింతించు జనులకెల్ల
గురువు పావనగంగయై కూర్చు ముదము
అట్టి గురుదేవునకు నతులాచరింతు 83

శ్లో॥ అజ్ఞానేనాహినా గ్రస్తాః ప్రాణినస్తాన్ చికిత్సకః।
విద్యాస్వరూపో భగవాన్ తస్మై శ్రీగురవేనమః॥

తే.గీ॥ ధాత్రి అజ్ఞాన విషసర్పదష్టుడైన
ప్రాణికి చికిత్సకుడు భగవంతుడతుల
పరమ విద్యాస్వరూపుడు గురువరుండె
అట్టి గురుదేవునకు నతులాచరింతు 84

శ్లో॥ హేతవే జగతామేవ సంసారార్ణవసేతవే।
ప్రభవే సర్వవిద్యానాం శంభవే గురవేనమః॥

తే.గీ॥ జగములకు ముఖ్యకారణంబగును గురువు,
చెలగు సంసార జలధికి సేతువగును
అన్ని విద్యలకును ప్రభువగునుగాదె
శంభుడగునట్టి గురుని కంజలి ఘటింతు 85

శ్లో॥ ధ్యానమూలం గురోర్మూర్తిః పూజామూలం గురోఃపదమ్।
మంత్రమూలం గురోర్వాక్యం ముక్తిమూలం గురోఃకృపా॥

తే.గీ॥ క్రమగురుమూర్తియే ధ్యానకారణంబు
ఘనగురుపదంబె పూజకు కారణంబు
సారగురువాక్యమే మంత్రకారణంబు
భూరి గురుకృపయే ముక్తికారణంబు 86

శ్లో॥ సప్తసాగర పర్యంత తీర్థస్నానఫలం తు యత్।
గురోః పాదోదబిందోశ్చ సహస్రాంశేన తత్ఫలమ్॥

తే.గీ॥ ఏడు సంద్రాల వరకిల నెన్నిగలవొ
అన్ని తీర్థాల మునిగిన యట్టి ఫలమె
ఒక్కగురుపాద జలబిందువొసగు ఫలము
నందు నరయ సహస్రాంశమగును దేవి! 87

శ్లో॥ శివేరుష్టే గురుస్త్రాతా గురౌరుష్టే న కశ్చన
లబ్ధ్వాకులగురుం సమ్యగ్గురుమేవ సమాశ్రయేత్

తే.గీ॥ శివుడు కోపించ గురువు రక్షింపగలడు
గురువుకోపించ కావలేడొరుడెవండు
కాన తమకుల గురువును మానసమున
భక్తి తనరారనాశ్రయింపంగ వలయు 88

శ్లో॥ మధు లుబ్ధోయథాభృంగః పుష్పాత్పుష్పాంతరంవ్రజేత్।
జ్ఞానలుబ్ధస్తథాశిష్యోగురోర్గుర్వంతరంవ్రజేత్॥

తే.గీ॥ తేనె నాశించి తుమ్మెద తిరిగి తిరిగి
పూవునుండియు వేరొక్క పూవుజేరు
అటులె జ్ఞానార్థమై శిష్యుడమితకాంక్ష
గురువరునిజేరవలయును గురుని విడిచి 89

శ్లో॥ వందే గురుపద ద్వంద్వం వాఙ్మనోఽతీతగోచరం।
శ్వేతరక్తప్రభాభిన్నం శివశక్త్యాత్మకం పరమ్॥

తే.గీ॥ మానసము వాక్కుమించినజ్ఞానమునకు
కానబడు గురుపాదయుగంబునకును
ధవళరక్త ప్రభాసంయుతమ్మునకును
వందనము శివశక్తి సంబంధమునకు 90

శ్లో॥ గుకారంచ గుణాతీతం రుకారం రూపవర్జితమ్।
గుణాతీత మరూపంచయోదద్యాత్సగురుస్స్మృతః॥

తే.గీ॥ అల గుకారము గుణములకందకుండు
అదె రుకారము రూపున కందకుండు
ఉర్విగుణరూపములనంటకుండునట్టి
తత్త్వమును బోధసేయు నాతండె గురువు 91

శ్లో॥ అత్రినేత్రశ్శివస్సాక్షాత్ ద్విబాహుశ్చ హరిః స్మృతః।
యోఽచతుర్వదనో బ్రహ్మశ్రీగురుఃకథితఃప్రియే॥

తే.గీ॥ మూడు కన్నులు లేని శంభుండటంచు
బాహువులు రెండుగల రమాభర్తయనుచు
నాల్గు మోములు లేనట్టి నలువయనుచు
గురువరుని సంస్తుతింతురు గిరితనూజ! 92

శ్లో॥ అయం మయాంజలిర్బద్ధో దయాసాగర సిద్ధయే।
యదనుగ్రహతో జంతుః చిత్రసంసార ముక్తిభాక్॥

తే.గీ॥ ఎవ్వరి యనుగ్రహంబున నిలనరుండు
వేగసంసార మందుండి విడువబడునొ
అట్టి మహిమలు గలుగు దయాంబురాశి!
అంజలి ఘటింతు నీకృపనందు కొనగ 93

శ్లో॥ శ్రీగురోః పరమం రూపం వివేక చక్షురగ్రతః।
మందభాగ్యా న పశ్యంతి అంధాస్సూర్యోదయంయథా॥

తే.గీ॥ ముందట గురూత్తముని దివ్యమూర్తియుండ
జ్ఞాననేత్రుండు దర్శింపగలడుకాని
కానలేరు గదా భాగ్యహీనులవని
సూర్యునుదయంబు నంధుండు చూడగలడె? 94

శ్లో॥ కులానాం కులకోటీనాం తారకస్తత్ర తతక్షణాత్।
అత స్తం సద్గురుం జ్ఞాత్వా త్రికాల మభివాదయేత్॥

తే.గీ॥ సద్గురుని వాక్కు విన్నంత సాధకుండె
ఉర్వి కులజాల కులకోటి నుద్ధరించు
ఇక్కతంబున గురువరునెరిగి భక్తి
మూడు కాలంబులందును మ్రొక్కవలయు 95

15. శిష్యుని గురుభక్తి :-

శ్లో॥ శ్రీనాథచరణ ద్వంద్వంయస్యాం దిశి విరాజతే।
తస్యాం దిశి నమస్కుర్యాత్ భక్త్యా ప్రతిదినం ప్రియే॥

కం॥ శ్రీదేశికు పాదద్వయ
మేదెస రాజిల్లుచుండు, నెంతయు, శిష్యుం
డాదెసకు భక్తితో నభి
వాదనమొనరింప వలయు ప్రతిదినమతివా! 96

శ్లో॥ సాష్టాంగప్రణిపాతేన స్తువన్నిత్యం గురుం భజేత్।
భజనాత్ స్థైర్యమాప్నోతి స్వస్వరూపమయో భవేత్॥

తే.గీ॥ సన్నిధిన్ సాగిలంబడి సన్నుతించి
శ్రీగురూత్తము సతము భజింపవలయు
స్థైర్యమును పొందు భజనచే సాధకుండు
భద్రకరమగు నాత్మానుభవము పొందు 97

శ్లో॥ దోర్భ్యాం పద్భ్యాంచ జానుభ్యా మురసాశిరసా దృశా।
మనసా వచసా చేతి ప్రణామోఽష్టాంగ ఉచ్యతే॥

కం॥ కరచరణ జానుయుగముల
ఉరమును, శీర్షమ్ము, దృష్టి నుల్లము పలుకున్
గురినిల్పిమ్రొక్కుచోనది
పరగును సాష్టాంగ వినతి పద్ధతి యగుచున్ 98

శ్లో॥ తస్మై దిశే సతత మంజలి రేషనిత్యం।
ప్రక్షిప్యతాం ముఖరి తైర్మధురైః ప్రసూనైః।
జాగర్తి యత్ర భగవాన్ గురుచక్రవర్తీ।
విశ్వస్థితిప్రళయనాటకనిత్యసాక్షీ॥

చం॥ జగదురు సంస్థితిప్రళయ సంభృత నాటక నిత్యసాక్షియై
తగ భగవంతుడై గురువతంసుడు తానెట మేలుగాంచి పొం
దుగ వెలుగొందు నాదెసకు దోయిలి యొగ్గి సతంబుస్తోత్రమిం
పుగ నొనరించుచున్, తగిన పుష్పల నర్పణ చేయగా వలెన్ 99

శ్లో॥ అభ్యస్తైఃకిము దీర్ఘకాల విమలైర్వ్యాధిప్రదైర్దుష్కరైః।
ప్రాణాయామ శతైరనేక కరణై ర్దుఃఖాత్మకై ర్దుర్జయైః।
యస్మిన్నభ్యుదితే వినశ్యతి బలీవాయుస్స్వయం తత్ క్షణాత్।
ప్రాప్తం తత్సహజ స్వభావమనిశం సేవేత చైకం గురుమ్॥

ద్వి॥ వ్యాధి దంబులు దుర్జయంబులు, పెక్కు,
సాధనంబుల చేతసాధ్యంబు లరయ
కడుదుష్కరంబులు కడు దుఃఖదములు
పుడమిప్రాణాయామములు వాని నరుడు
చిరకాలమట నభ్యసించుట వలన
పరిశుద్ధమగు తగుస్వాంతంబు కాని
సహజ స్వభావంబు సాధించునెడల
మహినింద్రియాసువుల్ మాయమైపోవు
ఆమహాస్థితి కృపనందించుచున్న
శ్రీమహాగురుదేవు సేవింపవలయు 100

శ్లో॥ జ్ఞానం వినా ముక్తిపదం లభ్యతే గురుభక్తితః।
గురోస్సమానతో నాన్యత్సాధనం గురుమార్గిణామ్॥

తే.గీ॥ జ్ఞానమదిలేకయున్నను సజ్జనునకు,
గురువునెడ భక్తి యున్నచో దొరకు ముక్తి
గురువరునిత్రోవనడచెడు నరునికెపుడు
గురుసదృశ సాధనములేదు ధరణియందు 101

శ్లో॥ యస్మాత్ పరతరం నాస్తి నేతినేతీతి వై శ్రుతిః।
మనసావచసా చైవ సత్యమారాధయేద్గురుమ్॥

తే.గీ॥ ఇద్దికాదిద్దికాదని దృశ్యతతుల
నన్నిటిని త్రోసి అపరమాత్ముడొకడె
శ్రేష్ఠతము డంచు శ్రుతి వివరించుచుండె
అట్టి సత్యస్వరూపుడై అలరు గురువు
కోరి మదిచేత మాటచే కొలువ వలయు 102

శ్లో॥ గురోఃకృపా ప్రసాదేన బ్రహ్మవిష్ణుమహేశ్వరాః।
సామర్థ్య మభజన్సర్వే సృష్టిస్థిత్యన్త కర్మణి॥

తే.గీ॥ దేశికేంద్రుని సత్కృపాదీప్తివలన
బ్రహ్మవిష్ణు మహేశ్వరస్వాములవని
సృష్టి సంస్థితి లయముల చేయు కొరకు
భూరి సామర్థ్యమును పొందినారు దేవి 103

గురుని సేవించువిధము సురాదులెరుగరనుట :-

శ్లో॥ దేవ కిన్నర గంధర్వాః పితృయక్షాస్తు తుంబురుః।
మునయోఽపినజానంతి గురుశుశ్రూషణే విధిమ్॥

తే.గీ॥ అరయ పితృదేవ గంధర్వయక్షవరులు
సిద్ధచారణ కిన్నర శేఖరులును
నారదుడు, తుంబురుడు, మునినాయకులును,
గురువరుని కొల్చు పద్ధతి నెఱుగరతివ 104

శ్లో॥ తార్కికాశ్ఛాందసాశ్చైవ దైవజ్ఞాః కర్మఠాః ప్రియే।
లౌకికాస్తే న జానంతి గురుతత్త్వం నిరాకులమ్॥

తే.గీ॥ ఛాందసులు కర్మఠులు, తర్కశాస్త్రవిదులు
జ్యోతిషులు లోకధర్మనయోన్నతులును
తలపగనలౌకికంబయి కలతలేని
గురువరేణ్యుని తత్త్వమ్మునెరుగలేరు 105

శ్లో॥ మహాహంకార గర్వేణ తపోవిద్యా బలేనచ।
భ్రమంతి చాస్మిన్ సంసారే ఘటీ యంత్రం యథా పునః॥

తే.గీ॥ నెమ్మనమ్మున నిక్కు గర్వమ్ము వలన
అలఘు విద్యాతపంబుల బలము వలన
నరులు సంసారమున బడి తిరుగుచుంద్రు
మాటి మాటికి నేతమ్ము మాడ్కిదేవి! 106

శ్లో॥ యజ్ఞినో ఽపినముక్తాః స్యుః నముక్తా యోగినస్తథా।
తాపసా అపినో ముక్తా గురుతత్త్వాత్పరాఙ్ముఖాః॥

తే.గీ॥ యాగములు చేయువారును యోగివరులు
ముఖ్యతాపసులును బహిర్ముఖులు గాన
గురువరుని తత్త్వమెరుగగా కోరకుంట
ముక్తులెన్నడు కాలేరు భూతలమున 107

శ్లో॥ న ముక్తాస్తు గంధర్వాః పితృ యక్షాస్తు చారణాః।
ఋషయస్సిద్ధ దేవాద్యా గురుసేవా పరాఙ్ముఖాః॥

తే.గీ॥ యక్ష గంధర్వ సిద్ధ మహర్షి వరులు
సాధ్య పితృదేవ కిన్నర చారణులును
గురువరుని తత్త్వమెరుగగాకోరకుంట
ముక్తులెన్నడు గారెల్ల భువనములను. 108



# ద్వితీయాధ్యాయము

17. గురుధ్యాన విధానము :-

శ్లో॥ ధ్యానం శృణు మహాదేవి సర్వానంద ప్రదాయకమ్।
సర్వసౌఖ్యకరంచైవ భుక్తిముక్తి ప్రదాయకమ్॥

తే.గీ॥ అతివ! ఆనందదాయకమైన యదియు
అఖిల సౌఖ్యకరంబయి అలరు నదియు
భుక్తి ముక్తి ప్రదంబయి పొలుచు నదియు
నైన ధ్యానంబు గూరిచి ఆలకింపు 109

శ్లో॥ శ్రీమత్పరంబ్రహ్మ గురుం స్మరామి।
శ్రీమత్పరంబ్రహ్మ గురుం భజామి।
శ్రీమత్పరంబ్రహ్మ గురుం వదామి।
శ్రీమత్పరంబ్రహ్మ గురుం నమామి॥

తే.గీ॥ శ్రీపరబ్రహ్మ గురువు స్మరించు చుంటి
శ్రీ పరబ్రహ్మ గురువు భజించు చుంటి
శ్రీ పరబ్రహ్మ గురువు వర్ణించు చుంటి
శ్రీ గురుస్వామికి జొహారు చేయుచుంటి 110

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం।
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్।
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం।
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి॥

సీ॥ అసమానుడైన బ్రహ్మానందరూపుని
పరమ సౌఖ్యమునిచ్చి పరగువాని
సంపూర్ణసార సుజ్ఞాన సన్మూర్తిని
ద్వంద్వబంధము లేక తనరువాని
తత్త్వమస్యాది వాక్తతి లక్ష్యమగువాని
ఆకాశమున కెనయైనవాని
అన్నింటి తానొక్కడై నిత్యుడగువాని
అచలుడై విమలుడై అలరువాని

తే.గీ॥ సర్వధీసాక్షిభూతుని సదయ హృదయు
భావమున కందక వెలుంగు భవ్యచరితు
త్రిగుణ రహితుని సద్గురుదేవదేవు
నాదుమది నిల్పికొల్తు ననారతంబు 111

శ్లో॥ హృదంబుజే కర్ణి కమధ్య సంస్థే।
సింహాసనే సంస్థిత దివ్యమూర్తిమ్।
ధ్యాయేద్గురుం చంద్రకళా ప్రకాశం।
సచ్చిత్సుఖాభీష్టవరం దదానమ్॥

తే.గీ॥ భవ్య హృదయాబ్జమున నున్న దివ్యమూర్తి
చంద్రకళబోలు సుప్రకాశంబువాని
సచ్చిదానంద రూపునిచ్ఛావరాళి
నెమ్మినొసగెడు గురుని ధ్యానింపవలయు 112

శ్లో॥ శ్వేతాంబర శ్వేతవిలేప పుష్పం।
ముక్తావిభూషం ముదితం ద్వినేత్రమ్।
వామాంకపీఠ స్థితదివ్యశక్తిం।
మందస్మితం పూర్ణకృపా నిధానమ్॥

తే.గీ॥ ధవళచందన, పుష్ప వస్త్రములదాల్చి
ముత్యములపేరు, చిరునవ్వు మోదమొసగ
వామ భాగానశక్తి దివ్యముగ వెలయ
నయన యుగ్మముతో, చిరునవ్వు తోడ
తనరు కరుణాకరు గురూత్తముని భజింతు. 113

శ్లో॥ ఆనందమానందకరం ప్రసన్నం।
జ్ఞానస్వరూపం నిజబోధయుక్తం
యోగీంద్ర మీడ్యం భవరోగ వైద్యం
శ్రీమద్గురుం నిత్యమహం నమామి॥

తే.గీ॥ శాంతుడానందుడానంద సాధకుండు
జ్ఞానరూపుడు స్వీయ సుజ్ఞాన యుతుడు
వరముని నుతుండు భవరోగవైద్యుడైన
గురువునకు వందన మొనర్తు నిరతమేను. 114

శ్లో॥ వందే గురూణాం చరణారవిందే।
సందర్శిత స్వాత్మ సుఖావబోధే
జనస్య యేజాంగలికాయమానే
సంసార హాలాహల మోహశాంత్యై॥

తే.గీ॥ ఆత్మదర్శన సౌఖ్యసమన్వితుండు
నగుచు జనులకు విషవైద్యుడైన గురుని
విమల పాదాంబుజముల సేవింప వలయు
చటుల సంసార విషమోహ శాంతికొరకు 115

శ్లో॥ యస్మిన్ సృష్టిస్థితిధ్వంస నిగ్రహానుగ్రహాత్మకం।
కృత్యం పంచవిధం శశ్వద్భాసతే తం గురుం భజే॥

తే.గీ॥ పార్వతీ! సృష్టి సంస్థితి ప్రళయములను
నిగ్రహానుగ్రహములను నియత సతత
పంచవిధ కర్మకర్తయై అంచితముగ
నెల్లపుడు వెల్గు శ్రీ గురునేభజింతు 116

శ్లో॥ పాదాబ్జే సర్వసంసార దావకాలానలం స్వకే।
బ్రహ్మరంధ్రే స్థితాంభోజమధ్యస్థం చంద్రమండలమ్॥

తే.గీ॥ సర్వసంసార వనము భస్మమ్మొనర్ప
ఘనగురుని పాదమున నుండు గద, దవాగ్ని
తద్గురూత్తము బ్రహ్మరంధ్ర స్థితాబ్జ
మధ్యమున నొప్పుగద–చంద్రమండలంబు 117

శ్లో॥ అకారాది త్రిరేఖాబ్జే సహస్ర దళమండలే।
హంసపార్శ్వ త్రికోణే చస్మరేత్తన్మధ్యగం గురుమ్॥

తే.గీ॥ అల అకారాది యగు త్రిరేఖాబ్జమందు
ఇమ్ముగ సహస్రదళ మండలమ్ము నందు
హంస ప్రక్కన భ్రూమధ్య మందు వెలయు
పరమ గురువును తలపగా వలయు దేవి. 118

శ్లో॥ నిత్యం శుద్ధనిరాభాసం నిరాకారం నిరంజనమ్।
నిత్యబోధం చిదానందంగురుం బ్రహ్మ నమామ్యహమ్॥

తే.గీ॥ నిత్యసుజ్ఞాని, నిత్యుండు, నిర్మలుండు,
ఘన చిదానందుడును, నిరాకార విభుడు,
ప్రథిత పరిశుద్ధుడును, నిరాభాసుడైన
సద్గురునికేను భక్తి నంజలి ఘటింతు 119

18. గురు దృష్టి ప్రభావము :-

శ్లో॥ సకల భువనసృష్టిః కల్పితాశేష సృష్టిః।
నిఖిలనిగమదృష్టిః సత్పదార్థైక సృష్టిః
అవగుణపరమేష్టిః సత్పదార్థైక దృష్టిః
భవగుణపరమేష్టిః మోక్షమార్గైక దృష్టిః॥

ద్వి॥ గురు తరంబగు వస్తుకోటితో జేర్చి
గురుదృష్టి సృష్టించు కొసరి లోకముల
ఇది సత్పదార్థమ్ము సృజియించుచుండు
ఇది వేద తతులచే నెరిగింపబడును
ఇదియె సత్యాత్మపై నెప్పుడున్నిలుచు
మదిలోని సంసార మమత పోద్రుంచు
అదిగాక ముక్తిపై ఆసక్తిపెంచు
కదిసి ఆఘనదృష్టి గల గురున్గొలుతు. 120

శ్లో॥ సకల భువన రంగ స్థాపనా స్తంభయష్టి।
సకరుణరస వృష్టిః తత్త్వమాలా సమిష్టిః
సకలసమయ సృష్టిః సచ్చిదానంద దృష్టిః
నివసతు మయి నిత్యం శ్రీగురోర్దివ్య దృష్టిః॥

ఉ॥ ఏది జగత్త్రయంబులను నిల్పుకు కంబమొతత్త్వమాలయౌ
నేది కృపాసుధారస సువృష్టియు నేదియొ, సర్వవేళలం
దేది సృజించు జీవతతి నిమ్మహి, సత్తును చిత్తు మోదమౌ
నేదియొ ఆగురుప్రవరు దృష్టి వసించును గాక నామదిన్ 121

19. గురుని గూర్చి త్రిమూర్తులు చెప్పినది :-

శ్లో॥ న గురోరధికం న గురోరధికం న గురోరధికం న గురోరధికమ్।
శివశాసనతః శివశాసనతః శివశాసనతః శివశాసనతః॥

తే.గీ॥ సద్గురుని మించునది లేదు జగతియందు
అనుచు పలుమరు శాసించె హరుడుగాన
శిష్యులెల్లరు గురుసేవ చేయవలయు
అనుచు తెలిపెను సూతుండు మునులకపుడు 122

శ్లో॥ ఇద మేవ శివం ఇద మేవ శివం ఇద మేవ శివం ఇద మేవ శివం।
హరిశాసనతో హరిశాసనతో హరిశాసనతో హరిశాసనతః॥

తే.గీ॥ గురువు మంగళరూపుడై ధరణి వెలుగు
ననుచు పలుమరు శాసించె హరియెకాన
శిష్యులెల్లరు గురుసేవ చేయవలయు
అనుచు తెలిపెను సూతుండు మునులకపుడు 123

శ్లో॥ విదితం విదితం విదితం విదితం విజనం విజనం విజనం విజనం।
విధిశాసనతో విధిశాసనతో విధిశాసనతో విధిశాసనతః॥

తే.గీ॥ గురువు బ్రహ్మస్వరూపుడంచెరుక కలిగె
అనుచు పలుమరు శాసించె అజుడుకాన!
శిష్యులెల్లరు గురుసేవ చేయవలయు
అనుచు తెలిపెను సూతుండు మునులకపుడు 124

20. గురూపదేశ ఫలము:-

శ్లో॥ ఏవం విధం గురుం ధ్యాత్వా జ్ఞానముత్పద్యతే స్వయం।
తదా గురూపదేశేన ముక్తో౽హ మితి భావయేత్॥

తే.గీ॥ నిశ్చలతనిట్లు గురుని ధ్యానించు నెడల
తనకు దానయి జ్ఞానంబు మనుజుజేరు
అపుడు గురునుపదేశంబునంది ఇంక
తాను ముక్తుడ ననుచును తలపవలయు. 125

శ్లో॥ గురూపదిష్టమార్గేణ మనశ్శుద్ధిం తు కారయేత్।
అనిత్యం ఖండయేత్సర్వం యత్కించిచ్చాత్మగోచరమ్॥

తే.గీ॥ సద్గురూత్తము నుపదేశ సరణి వలన
మనసు సంశుద్ధమయి నిల్చు మానవునకు
తనకు కనిపించునది అనిత్యంబటంచు
తానుపేక్షవహించుట తగును సుమ్మి! 126

శ్లో॥ జ్ఞేయం సర్వం ప్రతీతం చ జ్ఞానం చ మన ఉచ్యతే।
జ్ఞానం జ్ఞేయం సమం కుర్యాన్నాన్యః పంథా ద్వితీయకః॥

తే.గీ॥ దేవి విను! జ్ఞేయమగును ప్రతీతి యెల్ల
మహి ప్రతీతిని దెలుపును మానసంబు,
జ్ఞానమును జ్ఞేయము సమానమైన వనుచు
తలచుకంటెను మరియొక్క దారి లేదు 127

శ్లో॥ కిమత్ర బహునోక్తేన శాస్త్రకోటిశతైరపి।
దుర్లభా చిత్త విశ్రాంతిః వినా గురుకృపాం పరామ్॥

తే.గీ॥ బహు విధంబుల మాటలు పలుకనేల?
శాస్త్రములు కోటి విన్నను జగతియందు
సర్వజనులకు చిత్త విశ్రాంతి యెపుడు
గురుని సత్కృప లేకున్న దొరక గలదె 128

శ్లో॥ కరుణాఖడ్గపాతేన ఛిత్వా పాశాష్టకం శిశోః।
సమ్యగానంద జనకః సద్గురుః సోఽభిధీయతే॥

తే.గీ॥ కరుణయనియెడు వాడి ఖడ్గమున శిష్యు
తీవ్ర పాశాష్టకంబు ఛేదించి, సరిగ
నెవ్వరాత్మ మహానంద మీయగలరొ
అతడె సద్గురు వను పేరనవనినలరు 129

21. గురునిందా దుష్ఫలములు :-

శ్లో॥ ఏవం శ్రుత్వా మహాదేవి గురునిందాం కరోతి యః।
సయాతి నరకాన్ ఘోరాన్ యావచ్చంద్రదివాకరౌ॥

తే.గీ॥ ఇట్లు చెప్పిన సూక్తుల నెల్ల వినియు
వరగురుని నింద చేయుచో పాపమొంది
మనుజులతి ఘోర నరకంబు లనుభవింత్రు
భాస్కరుడు చంద్రుడున్నంత వరకు దేవి! 130

22. గురునియెడ శిష్యుడు ప్రవర్తింప వలసిన విధము :-

శ్లో॥ యావత్కల్పాంతకో దేహ స్తావద్దేవి గురుం స్మరేత్।
గురులోపో న కర్తవ్యః స్వచ్ఛన్దో యది వా భవేత్॥

తే.గీ॥ తనువు కల్పంబు ముగిసెడు దనుక నున్న
శ్రీ గురువు నంతవరకు స్మరింప వలయు
స్వేచ్ఛమీరగ దవ్వున శిష్యుడున్న
గురుని తలచుట మాత్రము మరువరాదు 131

శ్లో॥ హుంకారేణ న వక్తవ్యం ప్రాజ్ఞశిష్యైః కదాచన।
గురోరగ్రే నవక్తవ్య మసత్యం తు కదాచన॥

ఆ.వె॥ గురువునెదుట కోపపరత హుంకృతి జేసి
ప్రాజ్ఞులైన శిష్యవర్యులెపుడు
మాటలాడరాదు మరివారలెప్పుడు
కల్లలాడరాదు కమలనయన! 132

శ్లో॥ గురుం త్వం కృత్య హుంకృత్య గురుసాన్నిధ్య భాషణః।
అరణ్యే నిర్జలే దేశే సంభవేద్బ్రహ్మరాక్షసః॥

తే.గీ॥ నియతి విడనాడి గురువును నీవటంచు
హుంకృతిన్ జేసి మాటాడు చున్న నరుడు
జలములేని అరణ్య దేశమ్మునందు
బ్రహ్మరాక్షస జన్మంబు పడయు నిజము 133

శ్లో॥ అద్వైతం భావయేన్నిత్యం సర్వావస్థాసు సర్వదా।
కదాచిదపి నో కుర్యా దద్వైతం గురుసన్నిధౌ॥

తే.గీ॥ సర్వవేళల విడువక సాధకుండు
తరుణి! భావింపవలయు నద్వైతమవని
అయిన సద్గురు సన్నిధియందు నెపుడు
తగదు, తగదాచరింప నద్వైతమద్ది 134

శ్లో॥ దృశ్యవిస్మృతి పర్యంతం కుర్యా ద్గురుపదార్చనం।
తాదృశస్యైవ కైవల్యం న చ తద్వ్య తిరేకిణః॥

తే.గీ॥ కాంతరో! దృశ్య విస్మృతి కలుగు వరకు
సద్గురుని పాదపూజలు సలుప వలయు
అట్టివానికె కైవల్యమబ్బు సుమ్మి
అరయ తద్వ్యతిరేకికి దొరకదద్ది 135

శ్లో॥ అపి సంపూర్ణ తత్త్వజ్ఞో గురుత్యాగీ భవేద్యదా।
భవత్యేవ హి తస్యాంతకాలే విక్షేప ముత్కటమ్॥

తే.గీ॥ పూర్ణ తత్త్వానుభవమును పొందియున్న
గురుని గురుభక్తివీడగా గూడదెపుడు
అటుల వీడిన సాధకుండంత్యకాల
మందు తీవ్రంపు విక్షేపమొందునతివ! 136

శో॥ గురుకార్యం న లంఘేత నాపృష్ట్వా కార్య మాచరేత్।
న హ్యుత్తిష్ఠేద్దిశేఽనత్వా గురుసద్భావ శోభితః॥

తే.గీ॥ గురుని పరమాత్మునిగ మదినరయు నతడు
మేటి గురుకార్యము నతిక్రమింపరాదు
గురువు నడుగక పనిచేయకూడదెపుడు
గురుదిశకు మ్రొక్కకయె లేవగూడదెచట 137

శ్లో॥ గురౌసతి స్వయం దేవి! పరేషాం తు కదాచన।
ఉపదేశం న కుర్యాద్ధి తదా చేద్రాక్షసో భవేత్॥

తే.గీ॥ పార్వతీ! విను సద్గురు వర్యుడుండ
నితరులకు తానె ఉపదేశమీయరాదు
అట్టులెపుడైన చేసిన యాతడవని
రాక్షసుండగు నిక్కమో రాజవదన! 138

శ్లో॥ న గురోరాశ్రమే కుర్యాద్దుష్పానం పరిసర్పణం।
దీక్షా వ్యాఖ్యా ప్రభుత్వాది గురోరాజ్ఞాం న కారయేత్॥

తే.గీ॥ గురువరుని యాశ్రమంబున తిరుగరాదు
శిష్యుడే చెడుపానంబు చేయరాదు
వ్యాఖ్య దీక్షాధికారాలు పనికిరావు
గురుని యాజ్ఞ చేయింపరాదొరుల చేత 139

శ్లో॥ నోపాశ్రయం చ పర్యంకం న చ పాదప్రసారణం।
నాంగ భోగాదికం కుర్యాన్న లీలా మపరామపి॥

తే.గీ॥ అనుకొనరాదు గురుదేవునా శ్రమమున
పండుకొనరాదు మంచాన, పరుపుమీద
పాదములు సాచుకొనరాదు, పరులచేత
తన తనూసేవ చేయించుకొనగరాదు,
అచట నేక్రీడయును శిష్యుడాడరాదు. 140

శ్లో॥ గురూణాం సదసద్వాపి యదుక్తం తన్నలంఘయేత్।
కుర్వన్నాజ్ఞాం దివారాత్రౌ దాసవన్నివసేద్గురౌ॥

తే.గీ॥ మంచి యిది చెడ్డయనెడు విమర్శమాని
దేశికుని యాజ్ఞపాటించి తీరవలయు
రేయిపవలును దాసుని రీతి కొలిచి
పరమ గురుకృప శిష్యుడు పడయవలయు 141

శ్లో॥ అదత్తం న గురోర్ద్రవ్యముపభుంజీత కర్హిచిత్।
దత్తంచరంకవద్గ్రాహ్యం ప్రాణో ఽప్యే తేన లభ్యతే॥

తే.గీ॥ గురువొసంగక యుండిన గురుధనమ్ము
అనుభవింపగరాదు చేకొనుచునెపుడు
శిష్యుడు శరీరమిందు రక్షించుకొనగ
దాసునటుగొనవలె గురుదత్తధనము 142

శ్లో॥ పాదుకాసన శయ్యాది గురుణా యదభీప్సితమ్।
నమస్కుర్వీత తత్సర్వం పాదాభ్యాం న స్పృశేత్ క్వచిత్॥

తే.గీ॥ గురువునకు నెంతయో ప్రీతికరములైన
పాదుకాసన శయ్యాది వస్తువులకు
జోహరులొనర్పవలయు శిష్యుండు భక్తి
పాదముల తాకగారాదు వానినెచట 143

శ్లో॥ గచ్ఛతః పృష్ఠతో గచ్ఛేత్ గురుచ్ఛాయాం న లంఘయేత్।
నోల్బణం ధారయేద్వేషం నాలంకారాం స్తతోల్బణాన్॥

తే.గీ॥ గురువునడువగ తావెన్క నరుగ వలయు
తనగురుని నీడ శిష్యుండు దాటరాదు
అతిశయమ్ముగ వేషమ్ము, అతిశయముగ
భూషణంబులు దాల్చుటెప్పుడును తగదు 144

శో॥ గురు నిందాకరం దృష్ట్వా ధావయేదథ వాసయేత్।
స్థానం వా తత్పరిత్యాజ్యం జిహ్వాచ్ఛేదాక్షమో యది॥

తే.గీ॥ పరమ గురునింద చేసెడు వాని నాల్క
ఖండనము సేయవలె నట్లుగాని యెడల
తరుమవలె, లేక వేరొక్క తావునందు
జేర్పవలె, లేక తానివసించు స్థలము
శిష్యుడే వీడవలయును శీఘ్రముగను 145

శ్లో॥ నోచ్ఛిష్టం కస్యచిద్దేయం గురోరాజ్ఞాం నచత్యజేత్।
కృత్స్న ముచ్ఛిష్ట మాదాయ హవిర్వత్ భక్షయేత్స్వయమ్॥

ఆ.వె॥ గురుని యాజ్ఞబడసి గురుభుక్తశేషంబు
శిష్యుడొరులకింత చేరనీక
శ్రద్ధ మీరదాని సంగ్రహించి భుజింప
దగు ప్రసాదమనుచు తాదలంచి 146

శ్లో॥ నానృతం నాప్రియంచైవ న గర్వం నాపి వా బహు।
న నియోగపరం బ్రూయా ద్గురోరాజ్ఞాం విభావయేత్॥

తే.గీ॥ గురువరేణ్యుని సన్నిధి గరువ మూని
అప్రియంబులసత్యంబు లాడరాదు
ఎక్కువగ వల్కరాదాజ్ఞ లీయరాదు
శిరమునందాల్పవలయు సద్గురుని యాజ్ఞ 147

శ్లో॥ ప్రభో! దేవకులేశానాం స్వామి న్రాజన్ కులేశ్వర।
ఇతిసంబోధనై ర్భీతో గురుభావేన సర్వదా॥

తే.గీ॥ దేవ వర్గేశ్వరప్రభూ! దివ్యచరిత!
స్వామి! కులపతి! స్వప్రకాశస్వరూప!
అనెడు సంబోధనంబుల ననుదినంబు
వెలయు గురుసన్నిధిన్ భీతి మెలగ వలయు 148

23. గురు, సురల శాప పరిణామము:-

శ్లో॥ మునిభిః పన్నగై ర్వాపి సురైర్వా శాపితో యది।
కాలమృత్యు భయాద్వాపి గురు స్సంత్రాతి పార్వతి॥

ఆ.వె॥ మునులచేత నాగ ముఖ్యులచేతను
సకల సురలచేత శాపమొంది
కాల మృత్యుభీతి కంపించు శిష్యుని
గురువు కావగలడు సరసిజాక్షి! 149

శ్లో॥ అశక్తాహి సురాద్యాశ్చ హ్యశక్తా మునయ స్తథా।
గురుశాపోపపన్నస్య రక్షణాయ చ కుత్రచిత్॥

ఆ.వె॥ గురుని శాపమొంది పరితపించెడు వాని
సాధ్యసిద్ధ గరుడ చారణులును
ఘోరతపము చేసి పేరుగాంచిన మునుల్
రక్షసేయలేరు రాజవదన! 150

శ్లో॥ మంత్రరాజ మిదం దేవి గురు రిత్యక్షర ద్వయమ్।
స్మృతి వేద పురాణానాం సారమేవ న సంశయః॥

ఆ.వె॥ గురుపదమ్మునందు కొమరారు చుండిన
అక్షరద్వయంబె అఖిల మంత్ర
రాజ మగును, స్మృతి పురాణాలు వేదంబు
లెరుగజెప్పు సారమిదియె దేవి! 151

24. సన్యాసి లక్షణములు :-

శ్లో॥ సత్కార మానపూజార్థం దండకాషాయ ధారణః।
స సన్న్యాసీ న వక్తవ్యః సన్న్యాసీ జ్ఞానతత్పరః॥

తే.గీ॥ భూరి సత్కార గౌరవ పూజలంద
దండకాషాయ వస్త్రముల్ దాల్చునేని
అతడు సన్యాసియనుటకు నర్హుడగునె?
జ్ఞాన తత్పరుడమల సన్యాసియగును 152

శ్లో॥ విజానంతి మహావాక్యం గురోశ్చరణ సేవయా।
తేవై సన్న్యాసినః ప్రోక్తా ఇతరే వేషధారిణః॥

తే.గీ॥ గురుని పదసేవ సేయుచు పరమభక్తి
వర మహావాక్యముల భావ మెరుగువారె
అవని నిక్కంపు సన్యాసులగుదురెపుడు
తక్కువారెల్లరును వేషధారులతివ! 153

శ్లో॥ నిత్యం బ్రహ్మ నిరాకారం నిర్గుణం బోధయేత్పరం।
భాసయన్బ్రహ్మభావంచ దీపో దీపాంతరం యథా॥

తే.గీ॥ బ్రహ్మభావంబు భావించి భవ్యరీతి
నిర్గుణుడు రూపరహితుండు నిత్యుడైన
బ్రహ్మమును గూర్చి బోధింపవలయు దివ్వె
అన్యదీపము వెలిగించునట్లు దేవి! 154

25. శిష్యుడు స్వరూపజ్ఞతను పొందుట :-

శ్లో॥ గురుప్రసాదతః స్వాత్మన్యాత్మారామ నిరీక్షణాత్।
సమతా ముక్తిమార్గేణ స్వాత్మజ్ఞానం ప్రవర్తతే॥

తే.గీ॥ సుదతి! బ్రహ్మంబు దనయందు జూడగలడు
గురుని కృపముక్తి మార్గమై పరగువేద
వాక్య భావ విచారణ వలన నరుడు
స్వస్వరూపజ్ఞతను మరి సమతనొందు 155

26. ధ్యానింప దగిన సద్గురువర్యుడు :-

శ్లో॥ ఆబ్రహ్మస్తంబపర్యంతం పరమాత్మ స్వరూపకమ్।
స్థావరం జంగమంచైవ ప్రణమామి జగన్మయమ్॥

తే.గీ॥ బ్రహ్మమొదలుగ పూచికవరకు నున్న
జంగమస్థావరాత్మక జగతియందు
రూఢి నిండిన పరమాత్మరూపునకును
మహితునకు నేను భక్తి నమస్కరింతు 156

శ్లో॥ వందేఽహం సచ్చిదానందం భావాతీతం జగద్గురుమ్।
నిత్యం పూర్ణం నిరాకారం నిర్గుణం స్వాత్మసంస్థితమ్॥

ఆ.వె॥ సచ్చిదానందుడును స్వాత్మ సంస్థితుండు
భావములకు నతీతుండు బంధురుండు
నిత్యుడును రూప రహితుండు నిర్గుణుండు
పూర్ణుడైన జగద్గురువును భజింతు 157

శ్లో॥ పరాత్పరతరం ధ్యాయేన్నిత్య మానంద కారకం।
హృదయాకాశ మధ్యస్థం శుద్ధస్ఫటిక సన్నిభమ్॥

తే.గీ॥ బుద్ధి గుహయందు మిక్కిలి పొలుచు వాని
పుడమి అమలంపు స్ఫటికంబు బోలు వాని
ఆత్మకానందమొసగుచు నలరు వాని
నిత్యమును శ్రేష్ఠతముని ధ్యానింప వలయు 158

శ్లో॥ స్ఫటికే స్ఫాటికం రూపం దర్పణే దర్పణో యథా।
తథాఽఽత్మని చిదాకారమానందం సోఽహ మిత్యుత॥

తే.గీ॥ ఎటుల స్ఫటికంబు స్ఫటికమందేకమగునొ
ఎటుల అద్దంబు నందద్దమేకమగునొ
అటుల చిన్మయుడానందుడైన బ్రహ్మ
మాత్మలో దోచుచో తానె ఆతడనెడు
అనుభవము కల్గు గురుని వాక్యంబు వలన 159

శ్లో॥ అంగుష్ఠమాత్రం పురుషం ధ్యాయేచ్చ చిన్మయం హృది।
తత్ర స్ఫురతి యో భావః శృణు తత్కథయామి తే॥

తే.గీ॥ చిన్మయుని బుద్ధి గుహయందు చెలగు పురుషు
నిష్ఠ అంగుష్ఠ మాత్రు ధ్యానింప వలయు
దాని వలన స్ఫురించెడు తలపదేదొ
తెలియ జేసెద నీకిదే దేవి వినుము 160

శ్లో॥ అజోఽహ మమరోఽహం చ అనాదినిధనో హ్యాహం।
అవికారశ్చిదానందో హ్యణీయాన్మహతో మహాన్॥

తే.గీ॥ జనన మరణాలు నాద్యంత సంగతులును
మార్పులేవియు లేని చిన్మయుడనిదిగొ
అణువు నణువున నధికుల నధికతముడ
నేననెడు భావ ముదయించు నీరజాక్షి! 161

శ్లో॥ అపూర్వ మపరం నిత్యం స్వయంజ్యోతి ర్నిరామయం।
విరజం పరమాకాశం ధ్రువమానంద మవ్యయమ్॥

తే.గీ॥ వ్యాధి రహితుండు సుస్థిరుడవ్యయుండు
ముందు వెనుకలు లేని ఆనందమయుడు
నిత్యుడతడు స్వయం జ్యోతి నిర్గుణుండు
గగన భిన్నుండు దోష నిగ్రహుడటంచు
కలుగు నాత్మాను భవమది గౌరి వినుము. 162

శ్లో॥ అగోచరం తథా ఽగమ్యం నామరూప వివర్జితం।
నిశ్శబ్దం తు విజానీయా త్స్వభావా ద్బ్రహ్మ పార్వతి॥

తే.గీ॥ పార్వతీదేవి! ఆ పరబ్రహ్మమరయ
కానరానిది పొందగారాని దెవుడు
పేరు రూపును లేకయే వెలయు నదియు
శబ్దరహిత స్వభావమై జగతి యందు
పరగునట్టిదటంచు నీవెరుగవలయు 163

శ్లో॥ యథా గంధస్వభావత్వం కర్పూరకుసుమాదిషు।
శీతోష్ణత్వ స్వభావత్వం తథా బ్రహ్మణి శాశ్వతమ్॥

తే.గీ॥ అవని కర్పూర కుసుమాదులందు తావి
చల్లదన, మగ్ని నుష్ణత సహజమగుచు
ఎటుల నుండునో అట్టులే యెసగు చుండు
బ్రహ్మమందును శాశ్వతత్వమ్ము దేవి! 164

శ్లో॥ యథా నిజస్వభావేన కుండలే కటకాదయః
సువర్ణ త్వేన తిష్ఠంతి తథా ఽహం బ్రహ్మ శాశ్వతమ్॥

తే.గీ॥ కర్ణభూషణములు, హస్తకంకణములు
సహజముగ నెట్టులెప్పుడు స్వర్ణమయము
లగుచు తనరారు చుండునో అటులె సహజ
శాశ్వతత్వాన బ్రహ్మంబు జగతి వెలయు 165

శ్లో॥ స్వయం తథా విదో భూత్వా స్థాతవ్యం యత్రకుత్రచిత్।
కీటో భృంగ ఇవ ధ్యానాద్యథా భవతి తాదృశః॥

తే.గీ॥ భృంగమును పుర్వు ధ్యానించి భృంగమయిన
యటులె బ్రహ్మంబు ధ్యానించి నంత తాను
బ్రహ్మమగు పిమ్మట నతండు పంకజాక్షి!
తగిన తావున నివసింపదగును దేవి 166

శ్లో॥ గురుధ్యానం తథా కృత్వా స్వయం బ్రహ్మమయో భవేత్।
పిండేపదే తథా రూపే ముక్తాస్తే నాత్ర సంశయః॥

తే.గీ॥ నిత్యమట్టుల గురుని ధ్యానించునేని
తాను బ్రహ్మ మయుండయి తనరగలడు
పిండపద రూపముల నుండి విడువ బడుదు
రట్టి వారలు నిస్సంశయముగ దేవి! 167

27. పిండ, పద, రూప, రూపాతీత శబ్ద వివరణ :-
శ్రీ పార్వత్యువాచ :

శ్లో॥ పిండం కిం తు మహాదేవ పదం కిం సముదాహృతం।
రూపాతీతం చ రూపం కిం ఏతదాఖ్యాహి శంకర॥

వ॥ పార్వతీదేవి ఇట్లు పలికెను.

తే.గీ॥ నాగభూషణ! పిండమనంగ నేమి?
పదమనగనేమి? రూపశబ్దంబదేమి?
అభవ! ఈశ! రూపాతీత మనగనేమి?
విశదముగ తెల్పుమా నాకు విశ్వనాథ! 168

శ్రీ మహాదేవ ఉవాచ:-

శో॥ పిండం కుండలినీ శక్తిః పదం హంస ముదాహృతమ్।
రూపం బిందు రితి జ్ఞేయం రూపాతీతం నిరంజనమ్॥

వ॥ శ్రీ మహాదేవుడు ఇట్లు పలికెను.

తే.గీ॥ వెలది కుండలినీ శక్తి పిండమగును
పదమనగ హంస కాఖ్యయై పరగుచుండు
రూపమన బిందు వనుటకు రూఢికలదు
బ్రహ్మమునకు రూపాతీత పదము చెల్లు 169

శ్లో॥ పిండేముక్తాః పదేముక్తా రూపేముక్తా వరాననే।
రూపాతీతే తు యే ముక్తా స్తే ముక్తా నాత్రసంశయః॥

తే.గీ॥ మొనసి కుండలినీశక్తి దనరువారు
హంసతత్వముపాసించు నట్టివారు
నియతి బ్రహ్మంబు పయి బుద్ధి నిలువు వారు
ముక్తులే, గాని ముఖ్యులు ముక్తులందు
వస్తువిచారణ యొనర్చువారె దేవి! 170

శ్లో॥ గురుధ్యానేనైవ నిత్యం దేహీ బ్రహ్మమయో భవేత్।
స్థితశ్చ యత్ర కుత్రాపి ముక్తో ఽసౌ నాత్ర సంశయః॥

తే.గీ॥ అనిశమొనరించు సద్గురు ధ్యానముననె
బ్రహ్మమయుడయి శిష్యుండు వసుధవెలయు
ఇచ్ఛవచ్చిన యెడ వసియించుచున్న
అతడు ముక్తుండె యగు సంశయంబు లేదు 171

28. భగవంతుని షడ్గుణములు :-

శ్లో॥ జ్ఞానం వైరాగ్య మైశ్వర్యం యశశ్శ్రీస్స్వముదాహృతం।
షడ్గుణైశ్వర్యయుక్తో హి భగవాన్ శ్రీ గురుః ప్రియే॥

తే.గీ॥ జ్ఞానవైరాగ్యములు, మహైశ్వర్యమధిక
యశము, సంపద, తన రూపమనెడు నిట్టి
ఆరు గుణములతో గూడి అన్నియెడల
పొలుచు భగవంతుడే గురుమూర్తి దేవి! 172

29. బ్రహ్మజ్ఞాని లక్షణములు :-

శ్లో॥ గురుశ్శివో గురుర్దేవో గురుర్బంధు శ్శరీరిణాం।
గురురాత్మా గురుర్జీవో గురోరన్యన్నవిద్యతే॥

తే.గీ॥ గురువె వరమిచ్చు దేవుండు, గురువె శివుడు
జీవకోటికి బంధువు శ్రీగురుండె
గురువె ఆత్మయు ప్రాణంబు గురువెయగును
గురు వరుని కంటె అన్యంబు ధరణిలేదు. 173

శ్లో॥ ఏకాకీ నిస్పృహ శ్శాన్తశ్చింతాసూయా వివర్జితః।
బాల్యభావేన యో భాతి బ్రహ్మజ్ఞానీ స ఉచ్యతే॥

తే.గీ॥ శాంతుడగుచు, నసూయయు, చింతలేక
వాంఛలే లేక బాల భావంబు తోడ
ఒంటరిగ నెట్లో జీవించుచున్నవాని
అవని యందు బ్రహ్మజ్ఞాని యందు రతివ 174

30. వేదశాస్త్ర, మంత్ర, మతాదుల వలన సౌఖ్యములేదనుట :-

శ్లో॥ న సుఖం వేదశాస్త్రేషు న సుఖం మంత్రయంత్రకే।
గురోః ప్రసాదాదన్యత్ర సుఖం నాస్తి మహీతలే॥

తే.గీ॥ రాదు సుఖమింత వేదశాస్త్రముల వలన
రాదు సుఖమింత మంత్రయంత్రముల వలన
గురువరుననుగ్రహము దక్క ధరణియందు
ఇతర మేదియు సౌఖ్యంబు నీయలేదు 175

శ్లో॥ చార్వాక వైష్ణవమతే సుఖం ప్రాభాకరే న హి।
గురోః పాదాంతికే యద్వత్ సుఖం వేదాంత సమ్మతమ్॥

తే.గీ॥ గురుని సన్నిధి జరిగెడు పరమ వస్తు
సద్విచారణ చేగల్గు సౌఖ్యమెపుడు
వచ్చునే వైష్ణవమున చార్వాకముననను
వచ్చునే పూర్వమీమాంస వలనదేవి! 176

31. మౌనిపొందు సౌఖ్యమింద్రాదులకు లభిపదనుట :-

శ్లో॥ న తత్ సుఖం సురేంద్రస్య న సుఖం చక్రవర్తినాం।
యత్సుఖం వీతరాగస్య మునే రేకాంతవాసినః॥

తే.గీ॥ దృశ్యముల యందు నాసక్తి ఏమిలేక
పృథివి నేకాంతమందు జీవించు మౌని
పొందు సౌఖ్యమ్ము నింతయు పొందలేరు
చక్రవర్తులు, నింద్రుండు సరసిజాక్షి! 177

శ్లో॥ నిత్యం బ్రహ్మరసం పీత్వా తృప్తో యః పరమాత్మని।
ఇంద్రం చ మన్యతే రంకం నృపాణాం తత్ర కా కథా॥

తే.గీ॥ బ్రహ్మరసమును నిత్యంబు త్రాగి త్రాగి
తానె తనయందు తృప్తుడై తనరువాని
యెదుట నింద్రుండు లెక్కకునేమిరాడు
క్షితిపతుల మాట యికనేల చెప్పవలయు 178

గురువాక్య ఫలము :-

శ్లో॥ యతః పరమ కైవల్యం గురుమార్గేణ వై భవేత్।
గురుభక్తి రతః కార్యా సర్వదా మోక్షకాంక్షిభిః॥

తే.గీ॥ సద్గురుని వాక్యమున వచ్చు జ్ఞానముననె
పరమ కైవల్యమును నరుల్ పడయ గలరు
కాన మోక్షమునందాస గల్గువారు
భక్తి గురువర్యు సేవింప వలయు సతము 179

శ్లో॥ ఏకఏవాద్వితీయోஉహం గురువాక్యేన నిశ్చితః।
ఏవమభ్యస్యతా నిత్యం న సేవం వై వనాంతరమ్॥

తే.గీ॥ దేశికుని వాక్యమున నద్వితీయ మేక
మైన బ్రహ్మంబు నేనని ఆత్మనెరిగి
అనిశ మభ్యాస మొనరించు నట్టివారు
వనమునకు జేర వలసిన పనియెలేదు. 180

శ్లో॥ అభ్యాసాన్నిమిషేణైవ సమాధి మధిగచ్ఛతి।
ఆజన్మ జనితం పాపం తత్ క్షణాదేవ నశ్యతి॥

తే.గీ॥ నియతి నభ్యాస మొనరింప నిమిషముననె
మగ్నుడగును సమాధి, సమాధివలన
పుట్టినప్పటి నుండియు పొందియున్న
పాపమంతయు నశియించు పంకజాక్షి! 181

33. నిరాకారుని ధ్యానించుట కష్టము :-

శ్లో॥ కిమావాహన మవ్యక్తే వ్యాపకే కిం విసర్జనమ్।
అమూర్తే చ కథం పూజా కథం ధ్యానం నిరామయమ్॥

తే.గీ॥ పడతి! కనరాని వానికావాహనంబు,
జగతిలో వ్యాప్తునకును విసర్జనంబు
మూర్తియేలేని వానికి పూజలెటుల
చేయనగును? నిరాధారు చిత్తమందు
సంతతంబును ధ్యానింప శక్యమగునె? 182

34. గురువే త్రిమూర్తుల విధులు నిర్వహించును :-

శ్లో॥ గురుర్విష్ణు స్సత్త్వమయో రాజస శ్చతురాననః।
తామసో రుద్రరూపేణ సృజత్యవతి హన్తిచ॥

తే.గీ॥ గురువు సృష్టిస్థితిలయాల వరుస జేయ
రాజ సుండయి వర్తిల్లు బ్రహ్మయగును
విమల సాత్వికుడైనట్టి విష్ణువగును
ఉర్వి తామసుడయి మించు ఉగ్రుడగును 183

35. సాధకుని సమత్వము :-

శ్లో॥ స్వయం బ్రహ్మమయో భూత్వా తత్పరం చావలోకయేత్।
పరాత్పరతరం నాన్యత్ సర్వగం తన్నిరామయమ్॥

తే.గీ॥ బ్రహ్మమయుడయి తనయందు పరులయందు
బ్రహ్మమును తాను వీక్షింపవలయు నరుడు
అఖిలమయము నిరామయమయి వెలుంగు
బ్రహ్మమున కేదియును సాటిరాదు దేవి! 184

శ్లో॥ తస్యావలోకనం ప్రాప్య సర్వసంగ వివర్జితః
ఏకాకీ నిస్స్పృహ శ్శాన్త స్థ్సాతవ్యం తత్ప్రసాదతః॥

తే.గీ॥ గురుని సత్కృప బ్రహ్మంబు నరసి తాను
సర్వసంగంబు వర్జించి శాంతుడగుచు
కోరికలు మానసంబున చేరనీక
పృథ్వినేకాకి యగుచు జీవింప వలయు 185

శ్లో॥ లబ్ధం వా ఽథ న లబ్ధం వా స్వల్పం వా బహుళం తథా।
నిష్కామేనైవ భోక్తవ్యం సదా సంతుష్టమానసః॥

తే.గీ॥ దొరకనప్పుడు మనసున దుఃఖపడక
దొరికినది స్వల్పమైనను దొడ్డదైన
పూర్ణ నిర్మల నిష్కామమున సతంబు
తాను గొనవలె సంతుష్ట మానసమున 186

. ముక్తుని లక్షణము :-

శ్లో॥ సర్వజ్ఞపదమిత్యాహు ర్దేహీ సర్వమయో భువి।
సదా ఽ ఽ నందః సదాశాంతో రమతే యత్ర కుత్రచిత్॥

తే.గీ॥ అంతటను నిండియుండు బ్రహ్మము తానె
అని యెరిగి శాంతుడానందుడగుచు సతము
నిచ్చ వచ్చిన తావుననే వసించు
నరుని సర్వజ్ఞుడందురు ధరణియందు 187

శ్లో॥ యత్రైవ తిష్ఠతే సో ఽపి సదేశః పుణ్యభాజనః।
ముక్తస్య లక్షణం దేవి తవాగ్రే కథితం మయా॥

తే.గీ॥ ఎవరు నివసింప ఆదేశమెంతయేని
పుణ్యభాజన మయి కడు పొగడబడునొ
అట్టి ముక్తుని లక్షణ మమల చరిత!
నేను దెలిపితి నియ్యెడ నీకుదేవి! 188

. జ్ఞానరహితుని పూజాదులు వ్యర్థమగుట :-

శ్లో॥ ఉపదేశ స్త్వయం దేవి గురుమార్గేణ ముక్తిదః।
గురుభక్తి తథా ఽ త్యంతా కర్తవ్యా వై మనీషిభిః॥

తే.గీ॥ సద్గురు డొసంగు నుపదేశ సరణి వలన
ముక్తిదంబగు జ్ఞానంబు పొందవచ్చు
వినయ భావంబు మీర వివేకి యెపుడు
శ్రీ గురూత్తము శుశ్రూషచేయ వలయు 189

శ్లో॥ నిత్యయుక్తాశ్రయ స్సర్వవేదకృత్సర్వ వేదకృత్।
స్వపర జ్ఞానదాతా చ తం వందే గురు మీశ్వరమ్॥

తే.గీ॥ నిత్య మీశ్వరునందుతా నిలుచువాడు
దివ్య వేదవేదార్థాల తెల్పువాడు
స్వపరమాత్మని జ్ఞానమొసంగువాడు
నగు గురుబ్రహ్మమునకు జోహారొనర్తు 190

శ్లో॥ యద్యప్యధీతా నిగమా షడంగా ఆగమాః ప్రియే।
అధ్యాత్మాదీని శాస్త్రాణి జ్ఞానం నాస్తి గురుం వినా॥

తే.గీ॥ ఆగమంబుల, వేద షడంగములను,
జగతి దనరారు అధ్యాత్మశాస్త్రములను,
శ్రద్ధతో నభ్యసించిన జనులకైన
గురువులేకున్న జ్ఞానంబు దొరకబోదు 191

శ్లో॥ శివపూజా రతోవాఽపి విష్ణుపూజారతోఽథవా।
గురుతత్త్వ విహీనశ్చేత్తత్సర్వం వ్యర్థ మేవహి॥

తే.గీ॥ శివుని పూజలు నిరతితో చేయుచున్న
విష్ణుపూజలు శ్రద్ధగావించుచున్న
సద్గురుని తత్త్వమైన సుజ్ఞానమద్ది
పడయకుండిన సర్వంబు వ్యర్థమగును 192

శో॥ శివస్వరూప మజ్ఞాత్వా శివపూజా కృతా యది।
సా పూజా నామమాత్రం స్యాచ్చిత్రదీప ఇవ ప్రియే॥

తే.గీ॥ మెలకువ శివస్వరూపంబు తెలిసికొనక
శివుని పూజ సతంబును చేయునేని
ఫలకమున నున్న చిత్రదీపంబు వగిది
నామ మాత్రంబెయగునది నగ కుమారి! 193

శ్లో॥ సర్వంస్యాత్సఫలం కర్మ గురుదీక్షా ప్రభావతః।
గురులాభాత్సర్వలాభో గురుహీనస్తు బాలిశః॥

తే.గీ॥ వరగురూత్తము దీక్షా ప్రభావముననె
అఖిల కర్మలు సఫలంబులగును సర్వ
లాభములు కల్గు సద్గురు లాభమునను
గురునిజేరనివాడు మూర్ఖుండు దేవి! 194

. ముక్తుని లక్షణము :-

శ్లో॥ గురుహీనః పశుః కీటః పతంగో వక్తుమర్హతి।
శివరూపం స్వరూపంచ న జానాతి యత స్స్వయమ్॥

తే.గీ॥ గురువరునిచేత జ్ఞానంబు గొనక తానె
ఈశ్వరుని రూపు తనరూపు నెరుగలేడు
పశువనుచు, కీటకమ్మని, పక్షియనుచు
అట్టివానిని పిలుచుట యర్హమగును 195

. సద్గురువు నాశ్రయించుట :-

శ్లో॥ తస్మాత్సర్వప్రయత్నేన సర్వసంగ వివర్జితః।
విహాయ శాస్త్ర జాలాని గురుమేవ సమాశ్రయేత్॥

తే.గీ॥ సర్వవస్తువులందు నాసక్తి వీడి
తనకు నందగరాని శాస్త్రముల వీడి
సర్వవిధముల యత్నంబు సలిపి నరుడు
వరగురువునాశ్రయింపగా వలయు దేవి 196

శ్లో॥ నిరస్త సర్వసందేహో ఏకీకృత్య సుదర్శనం।
రహస్యం యో దర్శయతి భజామి గురుమీశ్వరమ్॥

తే.గీ॥ సర్వ సందేహముల మాన్పి, స్వపర బుద్ధి
సమయజేసి, అభేద సుజ్ఞాన మొసగి,
ఆత్మపరమాత్మ సంబంధమగు రహస్య
మెల్ల దెలిపెడు గురుదేవునే భజింతు 197

39. వేషధారి యగు గురువు :-

శ్లో॥ జ్ఞానహీనో గురుస్త్యాజ్యో మిథ్యావాదీ విడంబకః।
స్వవిశ్రాంతిం న జానాతి పరశాంతిం కరోతి కిమ్॥

తే.గీ॥ జ్ఞానమొందక, బాహ్యవేషంబు దాల్చి
వదరు గురువును విడువంగ వలయు నరులు
తనదు విశ్రాంతి తత్త్వమ్ము గనని యజ్ఞు
డన్యులకు శాంతి చేకూర్ప నర్హుడగునె? 198

శ్లో॥ శిలాయాః కిం పరం జ్ఞానం శిలాసంఘ ప్రతారణే।
స్వయం తర్తుం న జానాతి పరం నిస్తారయేత్కథమ్॥

తే.గీ॥ తలప తత్త్వమెరుంగని శిలకునెట్లు
శిలల చయమును దాటింప చేతనగును?
తానె తరియించు టెరుగని తత్త్వరహితు
డెట్లు పరులను దాటించు? నిందువదన! 199

శ్లో॥ న వందనీయాస్తే కష్టం దర్శనాద్భ్రాంతికారకాః।
వర్జయేత్తాన్గురూన్ దూరే ధీరస్యతు సమాశ్రయేత్॥

తే.గీ॥ కాంచినంతనె భ్రాంతిని కలుగజేయు
గురువులకు వందనము సేయగూడదెపుడు
వడిగ వారిని దవ్వున విడిచి నరులు
వరగురువునాశ్రయింపగా వలయు దేవి! 200

శ్లో॥ పాషండినః పాపరతా నాస్తికా భేదబుద్ధయః।
స్త్రీలంపటా దురాచారాః కృతఘ్నా బకవృత్తయః॥

తే.గీ॥ వేదబాహ్యులు, నురుపాపవృత్తి నరులు,
నాస్తికులు, భేదబుద్ధితో నడచువారు,
స్త్రీప్రసక్తులు, నడవడి చెడినవారు,
ధరకృతఘ్నులు, మరి బకధ్యానపరులు
నయిన గురువుల విడనాడుట్పర్మమగును 201

శ్లో॥ కర్మభ్రష్టాః క్షమానష్టా నింద్యతర్కైశ్చవాదినః।
కామినః క్రోధినశ్చైవ హింస్రాశ్చండాశ్శఠాస్తథా॥

తే.గీ॥ ఉత్తమ క్రియ విడనాడి, ఓర్పువీడి
వదలక కుతర్కమును బూని వాదులాడు
గురుల హింసక కాముక క్రోధనులను
కుత్సితుల, చండ చిత్తుల కొలువరాదు 202

శ్లో॥ జ్ఞానలుప్తా న కర్తవ్యా మహాపాపాస్తథా ప్రియే।
ఏభ్యో భిన్నో గురుస్సేవ్య ఏక భక్త్యా విచార్యచ॥

తే.గీ॥ జ్ఞానహీనుల మరి పాపసంగతులను
గురువులుగ నెన్నుకొనరాదు సరసిజాక్షి!
వీరికంటెను భిన్నుడై వెలయు గురుని
నిల విచారించి భక్తితో కొలువ వలయు 203

సద్గురు లక్షణములు :-

శ్లో॥ శిష్యాదన్యత్ర దేవేశి న వదేద్యస్య కస్యచిత్।
నరాణాంచ ఫలప్రాప్తౌ భక్తి రేవ హి కారణమ్॥

తే.గీ॥ శిష్యులకు దక్క నొరులకు చెప్పరాదు
దేశికుల తత్త్వమును సర్వదేవనేత్రి
భక్తి వలననె మానవుల్ పడయగలరు
జ్ఞాన ఫలమును ధారణీ స్థలమునందు 204

శ్లో॥ గూఢో దృఢశ్చ ప్రీతశ్చ మౌనేన సుసమాహితః।
సకృత్కామగతో వాఽపి పంచధా గురు రీరితః॥

చ॥ ఎరుక గడించియున్ తనకునేదియు రాదను నట్లులుండుటల్,
నిరతము సుప్రసన్నుడయి నిల్చుట, సత్యమితోక్తి పల్కుటల్
స్థిరముగ బ్రహ్మమందు మది చేర్చుట మేలగు కోర్కెలొందుటల్
గురువరు లక్షణంబులివిగో ఇవియైదును వింటివా ప్రియా 205

41. గురునికి వస్తు సమర్పణ :-

శ్లో॥ సర్వం గురుముఖాల్లబ్ధం సఫలం పాపనాశనమ్।
యద్యదాత్మ హితం వస్తు తత్తద్ద్రవ్యం న వంచయేత్॥

తే.గీ॥ పార్వతీదేవి! గురుదత్త వస్తుచయము
ఫలము నిచ్చును పాపంబు తొలగజేయు
తనకు ప్రియమైన ద్రవ్యంబు మనుజుడెపుడు
గురుని కర్పించి అట నుండి గొనుట తగును 206

శ్లో॥ గురుదేవార్పణం వస్తు తేన తుష్టోఽస్మి సువ్రతే।
శ్రీగురోః పాదుకాం ముద్రాం మూలమంత్రంచ గోపయేత్॥

తే.గీ॥ వస్తువేదైన గురుని కర్పణము సేయ
తృప్తినొందెద మది యందు నిందువదన!
మూల మంత్రము, గురుదేవు ముద్ర, గురుని
పాదుకలు శ్రద్ధమీర కాపాడవలయు 207

42. నమస్కార ఫలము :-

శ్లో॥ నతాఽస్మి తేనాథ పదారవిందం।
బుద్ధీంద్రియ ప్రాణ మనో వచోభిః।
యచ్చిన్త్యతే భావిత(మా) ఆత్మయుక్తౌ।
ముముక్షుభిః కర్మమయోపశాంతయే॥

తే.గీ॥ ఆత్మరూపాను సంధాన మాచరించు
అల ముముక్షువు లిల కర్మ మణగు కొఱకు
తలచు తత్త్వ స్వరూపమై తనరు నీదు
పద సరోజాతమునకు మ్రొక్కుదును స్వామి!
మాట బుద్ధీంద్రియ ప్రాణ మానసముల 208

శ్లో॥ అనేన యద్భవేత్కార్యం తద్వదామి తవ ప్రియే।
లోకోపకారకం దేవి లౌకికం తు వివర్జయేత్॥

తే.గీ॥ ఇటు నమస్కార మొనరింప నేమిఫలము
కల్గునో అద్ది వివరింతు కలికి నీకు
వినుము లోకంబు నకునిది పనికిరాదు
విడువ వలయును లౌకిక వినతి జగతి 209

శ్లో॥ లౌకికాద్ధర్మతో యాతి జ్ఞానహీనో భవార్ణవే।
జ్ఞానభావేచ యత్సర్వం కర్మ నిష్కర్మ శామ్యతి॥

తే.గీ॥ అతివ! లౌకిక ధర్మంబు ననుసరింప
మనుజుడజ్ఞానియై భవ వనధి మునుగు
ఒప్పు జ్ఞానంబు చేతనే ఉపశమిల్లు
అతని కర్మలు నిష్కర్మలగును దేవి! 210

. గురుగీతా ప్రభావము :-

శ్లో॥ ఇమాన్తు భక్తిభావేన పఠేద్వై శృణుయాదపి।
లిఖిత్వా యత్ప్రదానేన తత్సర్వం ఫల మశ్నుతే॥

తే.గీ॥ పార్వతీ! గురుగీతను వ్రాసి నరుడు
ప్రజకు దానంబుసేయ ఏ ఫలము కలదొ
ఆ ఫలంబంతయును వచ్చు నవని యందు
విమల భక్తి పఠించిన వినినయంత 211

శ్లో॥ గురుగీతా మిమాం దేవి హృది నిత్యం విభావయా।
మహావ్యాధిగతైర్దుఃఖైః స్సర్వదా ప్రజపేన్ముదా॥

తే.గీ॥ పడతి! ఈ గురుగీతను పరమ భక్తి
మనసునందు స్మరింపు మీ వనుదినంబు
వ్యాధిచే కల్గు దుఃఖ తీవ్రత్వమునను
విడక ముదమున దీని జపింప వలయు 212

శ్లో॥ గురుగీతాక్షరైకైకం మంత్రరాజ మిదం ప్రియే।
అన్యేచ వివిధాః మంత్రాః కళాం నార్హంతి షోడశీమ్॥

చ॥ అతివ! గురుగీత నున్న ప్రత్యక్షరంబు
రమ్యమైన మహామంత్రరాజమగును
తక్కు బహువిధ మంత్రముల్ తగిన వగునె
అరయ నీ మంత్రమున షోడశాంశమునకు 213

శ్లో॥ అనంతఫల మాప్నోతి గురుగీతా జపేన తు।
సర్వపాప హరా దేవి సర్వదారిద్ర్యనాశినీ॥

తే.గీ॥ ప్రీతి గురుగీత నెపుడు జపించునరుడు
భువి ననంత ఫలమ్మును పొందగలడు
పరమ గురుగీత సర్వపాపముల నణచు
సర్వ దారిద్ర్యములను నాశంబొనర్చు 214

శ్లో॥ అపమృత్యుహరా చైవ సర్వసంకట నాశినీ।
యక్షరాక్షస భూతాది చోరవ్యాఘ్ర విఘాతినీ॥

తే.గీ॥ వివిధ బాధ, లకాల మృత్యువు తొలంగు,
యక్షరాక్షస భూత సర్పాది భయము,
వ్యాఘ్ర చోరాది భయము విధ్వంసమగును
మహిత గురుగీతను పఠించు మానవులకు 215

శ్లో॥ సర్వోపద్రవకుష్ఠాది దుష్టదోషనివారిణీ।
యత్ఫలం గురుసాన్నిధ్యాత్తత్ఫలం పఠనాద్భవేత్॥

తే.గీ॥ అఖిల కష్టాలు భయద కుష్ఠాది బహుళ
దుష్టదోషాదులన్నియు నష్టమగును
గురుని సన్నిధి వలన చేకురు ఫలమ్ము
చేరు గురుగీతను పఠించు వారికతివ! 216

శ్లో॥ మహావ్యాధిహరా సర్వవిభూతే స్సిద్ధిదా భవేత్।
అథవా మోహనే వశ్యే స్వయమేవ జపేత్ సదా॥

తే.గీ॥ కలికి! గురుగీత మొండి వ్యాధుల హరించు
వెలయు సర్వ విభూతుల కలుగజేయు
మోహనమునకు మరి వశ్యమునకు సతము
పరమ గురుగీతను జపింప వలయు నరుడు 217

శ్లో॥ కుశదూర్వాసనే దేవి హ్యాసనే శుభ్రకంబళే।
ఉపవిశ్యతతో దేవి జపేదేకాగ్రమానసః॥

తే.గీ॥ చెలగు గరికల దర్భల జేసినట్టి
ఆసనముల, లసత్కంబళాసనముల
తాను కూర్చుండి ఏకాగ్రమానసమున
పరమ గురుగీతను జపింప వలయు దేవి! 218

44. గురుగీతా జపమునకు అర్హానర్హాసనములు :-

శ్లో॥ శుక్లం సర్వత్ర వై ప్రోక్తం వశ్యే రక్తాసనం ప్రియే।
పద్మాసనే జపేన్నిత్యం శాంతి వశ్యకరం పరమ్॥

తే.గీ॥ తెలుపు తగునని శాస్త్రముల్ తెలుపుచుండు
అర్హమగు వశ్యమునకు రక్తాసనంబు
వితత పద్మాసనమున జపింపవలయు
శాంతి కరమగు గురుగీత సంతతంబు 219

శ్లో॥ వస్త్రాసనేచ దారిద్ర్యం పాషాణే రోగసంభవః।
మేదిన్యాం దుఃఖమాప్నోతి కాష్ఠే భవతి నిష్ఫలమ్॥

తే.గీ॥ అలము పేదరికమ్ము వస్త్రాసనమున,
అధిక రోగమ్ము వచ్చు శిలాసనమున
అమిత దుఃఖమ్ము కలుగు ధరాసనమున
అన్ని కార్యాలు చెడును కాష్ఠాసనమున 220

శ్లో॥ కృష్ణాజినే జ్ఞానసిద్ధిః మోక్షశ్రీర్వ్యాఘ్రచర్మణి।
కుశాసనే జ్ఞానసిద్ధిః సర్వసిద్ధిస్తు కంబళే॥

చ॥ అబ్బు జ్ఞానంబు కృష్ణాజి నాసనమున
అబ్బు మోక్షంబు వ్యాఘ్రచర్మాసనమున
అమల సుజ్ఞాన మొదవు దర్భాసనమున
అఖిల శుభములె యగు కంబళాసనమున 221

45. గురుగీతా జపమున దిశ లొసగు ఫలము :-

శ్లో॥ ఆగ్నేయ్యాం కర్షణం చైవ వాయవ్యాం శత్రునాశనం।
నైర్‌ృత్యాం దర్శనం చైవ ఈశాన్యాం జ్ఞానమేవచ॥

తే.గీ॥ దివ్యజపకాలమున అగ్ని దిక్కుఁజూడ
జనుల తనదెస ద్రిప్పెడు శక్తివచ్చు
పవను దిశఁజూడ నశియించు వైరిగణము
నైర్‌ృతినిగన సురదర్శనంబు కలుగు
శివుని దెసఁజూడ జ్ఞాన సంసిద్ధియగును 222

శ్లో॥ ఉదఙ్ముఖః శాంతి జాప్యే వశ్యే పూర్వముఖ స్తథా।
యామ్యే తు మారణం ప్రోక్తం పశ్చిమే చ ధనాగమః॥

తే.గీ॥ భూరి గురుగీతనుత్తరమునకు దిరిగి
శ్రద్ధ పారాయణము సేయ శాంతియొదవు
పూర్వముఖుడైన లొంగిపోవుదురు సురలు
దక్షిణము జూడ శాత్రవతతి నశించు
పశ్చిమంబును గన ధన ప్రాప్తియగును 223

46. గురుగీతా పఠన, ధ్యాన. జప ఫలములు :-

శ్లో॥ మోహనం సర్వభూతానాం బంధమోక్షకరం పరం।
దేవరాజ ప్రియకరం రాజానం వశమానయేత్॥

తే.గీ॥ మహిత గురుగీతను పఠించు మానవులకు
భూతములు లొంగు, బంధ విముక్తి కలుగు
మిత్రుడగుచు మహేంద్రుండు మేలు గూర్చు
రాజు వశుడయి వర్తిల్లు రాజవదన! 224

శో॥ ముఖస్తంభకరం చైవ గుణానాంచ వివర్ధనం।
దుష్కర్మనాశనం చైవ తథా సత్కర్మ సిద్ధిదమ్॥

తే.గీ॥ సతత గుణవృద్ధికరము, వాక్స్తంభకరము
నరకృత విశాల దుష్కర్మనాశకరము
బుద్ధి మత్కృత సత్కర్మ సిద్ధి కరము
భవ్య సద్గురు గీతాజపమ్ము దేవి! 225

శ్లో॥ అసిద్ధంసాధయేత్కార్యం నవగ్రహ భయాపహమ్।
దుస్స్వప్ననాశనం చైవ సుస్వప్న ఫలదాయకమ్॥

తే.గీ॥ నరులు గురుగీతను పఠింప జరుగకున్న
పనులు జరుగు నవగ్రహ భయము తొలగు
కలత కలిగించు దుస్స్వప్నములు నశించు
పుడమి సుస్వప్నముల ఫలమ్ములు లభించు 226

శ్లో॥ మోహశాంతికరం చైవ బంధమోక్షకరం పరమ్।
స్వరూపజ్ఞాన నిలయం గీతాశాస్త్ర మిదం శివే॥

తే.గీ॥ సంయమినుతంబు గీతాసుశాస్త్ర మిద్ది
కలచు మోహంబు నంతటి తొలగ జేయు
బంధమోక్షంబు వేగమే పడయజేయు
ఆత్మ సుజ్ఞానమును దయ నందజేయు 227

శ్లో॥ యం యం చింతయతే కామం తం తం ప్రాప్నోతి నిశ్చయమ్।
నిత్యం సౌభాగ్యదం పుణ్యం తాపత్రయ కులాపహమ్॥

తే.గీ॥ ఎప్పుడేకోరికల పఠియించుచున్న
తీర్చువానిని గురుగీత కూర్చుచుండు
నిత్యమును పుణ్య సౌభాగ్య నిచయములను
అవని తాపత్రయంబు పోకార్చుచుండు 228

శ్లో॥ సర్వశాంతికరం నిత్యం వంధ్యాస్త్రీ సుపుత్రదమ్।
అవైధవ్యకరం స్త్రీణాం సౌభాగ్యస్య వివర్ధనమ్॥

చ॥ సాధ్వి! గురుగీతను పఠింప శాంతులొదవు
వంధ్యకుసుపుత్రుడుదయించి వన్నెకెక్కు
సుదతులకు నిల్చు మాంగల్య శోభ చిరము
ఎల్ల భాగ్యాలు మిగుల వర్ధిల్లు దేవి! 229

శ్లో॥ ఆయురారోగ్య మైశ్వర్యం పుత్రపౌత్ర వివర్ధనం।
నిష్కామ జాపీ విధవా పఠేన్మోక్ష మవాప్నుయాత్॥

తే.గీ॥ జనులు దీర్ఘాయురారోగ్య సంపదలను
పుత్రపౌత్రాభి వృద్ధిని పొందగలరు
పూతగీతను నిష్కామమున పఠింప
సత్య మిద్ది అనాథ మోక్షంబు నొందు 230

శ్లో॥ అవై ధవ్యం సకామా తు లభతే చాన్య జన్మని।
సర్వదుఃఖమయం విఘ్నం నాశయేత్తాపహారకమ్॥

తే.గీ॥ వెలది గురుగీత కోర్కి జపించు నెడల
వివిధ దుఃఖమయంబు లౌ విఘ్నములను
తాపముల బాపి మిగుల సంతసము మీర
అన్య జన్మల పతి గూడి అలరు నెపుడు 231

శ్లో॥ సర్వపాప ప్రశమనం ధర్మకామార్థ మోక్షదం।
యం యం చింతయతే కామం తం తం ప్రాప్నోతి నిశ్చితం॥

తే.గీ॥ భవ్య గురుగీత సకల పాపముల నణచు
కరుణ ధర్మార్థ కామ మోక్షముల నిచ్చు
కూర్మి నెవ్వార లే కోర్కె కోరుచున్న
నిశ్చయంబుగ వాని నన్నిటిని దీర్చు 232

శ్లో॥ కామ్యానాం కామధేను ర్వై కల్పతే కల్పపాదపః।
చింతామణిః చింతితస్య సర్వమంగళ కారకమ్॥

కం॥ గురుగీతా ధ్యానంబది
సురధేనువు, సురల తరువు, సురవర మణియై
నెరవేర్చు కోర్కులన్నిటి
విరివిగ శుభముల నొసంగు విబుధేశనుతా 233

శ్లో॥ లిఖిత్వా పూజయేద్యస్తు మోక్షశ్రియ మవాప్నుయాత్।
గురుభక్తి ర్విశేషేణ జాయతే హృది సర్వదా॥

తే.గీ॥ ప్రీతి గురుగీత వ్రాసి జపించు నట్టి
భూజనులు మోక్ష లక్ష్మిని పొందగలరు
వారి కనిశంబు సద్గురు వర్యుభక్తి
చిత్తమందు జనించు విశేషముగను 234

శ్లో॥ జపంతి శాక్తా స్సౌరాశ్చ గాణాపత్యాశ్చ వైష్ణవాః।
శైవాః పాశుపతా స్సర్వే సత్యం సత్యం న సంశయః॥

తే.గీ॥ భక్తి రవిగొల్చువారలు, వైష్ణవులును,
శాక్తులును, మరి గణపతి భక్త వరులు
శైవులును, పాశుపతులు నిస్సంశయముగ
సతము గురుగీతను జపింత్రు సత్యమిద్ది 235



# తృతీయాధ్యాయము

47. గురుగీతా జపమునకు అర్హ ప్రదేశములు :-

శ్లో॥ అథ కామ్యజపస్థానం కథయామి వరాననే।
సాగరాంతే సరిత్తీరే తీర్థే హరిహరాలయే॥

తే.గీ॥ దేవి! తెల్పెద కోర్కి సిద్ధించుకొరకు
జపము సేయంగదగు ప్రదేశముల గూర్చి
అర్హములు శైవ విష్ణు దేవాలయములు
తీర్థములు వారి నిధినదీతీరములును 236

శ్లో॥ శక్తి దేవాలయే గోష్ఠే సర్వదేవాలయే శుభే।
వటస్యధాత్ర్యా మూలే వా మఠే బృందావనే తథా।
పవిత్రే నిర్మలేదేశే నిత్యానుష్ఠానతోఽపివా।
నిర్వేదనేన మౌనేన జపమే తత్సమారభేత్॥

తే.గీ॥ ఆవులు వసించు చోట, శక్త్యాలయముల
అన్యశుభకర సర్వదేవాలయముల
అలఘు వట వృక్షముల క్రింద, ఆశ్రమముల
తులసి బృందావనోత్తమ స్థలములందు 237

తే.గీ॥ దివ్య నిర్మల పూతప్రదేశమందు
సంతతధ్యాన పావన ప్రాంతమందు
మౌనము వహించి శాంతిని మదిగ్రహించి
పరమగురుగీతను జపింపవలయుదేవి! 238

శ్లో॥ జాప్యేన జయమాప్నోతి జపసిద్ధిం ఫలం తథా।
హీనంకర్మ త్యజేత్సర్వం గర్హిత స్థానమేవచ॥

తే.గీ॥ జపము నియమంబుతో జేయ జయముగల్గు
శ్రేయమును గూర్చు జపఫలసిద్ధిగలుగు
హీనకర్మల చేయగా బూనరాదు
హేయమగు తావున జపంబుసేయరాదు 239

శ్లో॥ శ్మశానే బిల్వమూలే వా వటమూలాంతికే తథా।
సిధ్యంతి కానకేమూలే చూతవృక్షస్య సన్నిధౌ॥

తే.గీ॥ వెమ్మి మామిడి క్రింద బిల్వమ్ము క్రింద
మరి శ్మశానము నందును, మఱ్ఱినీడ,
చింతలను బావు కానుగచెట్టుక్రింద
జపము గావింప వలయును జలజనయన 240

3. గురు గీతా జపమునకు వాడదగు ఆసనవర్ణములు :-

శ్లో॥ పీతాసనం మోహనే తు హ్యసితం చాభిచారికే।
జ్ఞేయం శుక్లంచ శాంత్యర్థం వశ్యే రక్తం ప్రకీర్తితమ్॥

తే.గీ॥ అతివ! మోహనమునకు పీతాసనంబు
అరుల హింసింప నల్లని యాసనంబు,
అవని జనవశ్యమునకు రక్తాసనంబు
అమల మౌ శాంతికొరకు శ్వేతాసనంబు
వాడదగు జపమొనరించు వారలవని 241

). గురుగీతా జపమునకు తగిన సమయములు :-

శ్లో॥ జపం హీనాసనం కుర్వన్ హీనకర్మాఫలప్రదం।
గురుగీతాం ప్రయాణే వా సంగ్రామే రిపుసంకటే॥

శ్లో॥ జపన్ జయమవాప్నోతి మరణే ముక్తి దాయికా।
సర్వకర్మాణి సిధ్యంతి గురుపుత్రే న సంశయః॥

తే.గీ॥ హీనజపమును చేసిన, హీనకర్మ
చేసినను రాదు సత్ఫలసిద్ధి యెపుడు
ఆహవము చేయునపుడు, ప్రయాణమపుడు
రిపులచే సంకటము పడునపుడు భక్తి
విమల గురుగీతను పఠింప విజయ మొదవు 242

తే.గీ॥ మరణమొందిన నరులకు దొరకు ముక్తి
సద్గురూత్తము శిష్యుండు సలుపునట్టి
సర్వకార్య సమూహంబు సఫలమగును
విమల గురుగీతను జపింప కమల నయన! 243

50. మంత్ర దీక్ష గ్రహించిన శిష్యుడు :-

శ్లో॥ గురుమంత్రో ముఖే యస్యతస్య సిద్ధ్యంతి నాన్యథా।
దీక్షయా సర్వకార్యాణి సిద్ధ్యంతి గురుపుత్రకే॥

తే.గీ॥ ఎవని ముఖమున గురుమంత్రమెసగునతని
పనులు సిద్ధించు, వేరొక్క పథము లేదు
మంత్రదీక్ష గ్రహించుచో మహితగురుని
శిష్యు కార్యాలు నెరవేరు శీఘ్రముగను 244

51. గురుగీత గంగవంటిది :-

శ్లో॥ భవమూల వినాశాయ చాష్టపాశ నివృత్తయే।
గురుగీతాంబుసి స్నానం తత్త్వజ్ఞః కురుతే సదా॥

తే.గీ॥ సంసృతికి మూలమైన అజ్ఞత నశింప
అష్టపాశాలు తెగిపోవ అతుల భక్తి
అమల గురుగీతయను గంగయందు సతము
స్నానమొనరించు తత్త్వజ్ఞ సంచయంబు 245

52. సత్తును, అసత్తును గ్రహించిన గురువు :-

శ్లో॥ స ఏవ సద్గురు స్సాక్షాత్ సదసద్బ్రహ్మ విత్తమః।
తస్య స్థానాని సర్వాణి పవిత్రాణి న సంశయః॥

తే.గీ॥ సత్తు బ్రహ్మంబు, లోకమసత్తటంచు
నెఱుగునాతడు ప్రత్యక్షగురువరుండు
అతని స్థానంబులన్నియు అవని యందు
అతి పవిత్రంబులగు సంశయంబులేదు 246

శ్లో॥ సర్వశుద్ధః పవిత్రో ఽసౌ స్వభావాద్యత్ర తిష్ఠతి।
తత్ర దేవగణాః సర్వేక్షేత్రపీఠే చరంతి చ॥

ఆ.వె॥ సహజ పూతుడగుచు సర్వశుద్ధుండయి
ఒప్పుచున్న సద్గురూత్తముండు
కృపవహించి యెప్పుడే క్షేత్రమున నుండు
నచట సంచరించు అమరగణము 247

గురుగీతను ఏపని చేయుచుండినను జపింపదగును :-

శ్లో॥ ఆసనస్థా శ్శయానా వా గచ్ఛన్త స్తిష్ఠతో ఽపి వా।
అశ్వారూఢా గజారూఢా సుషుప్తా జాగ్రతో ఽపి వా॥

శ్లో॥ శుచిర్భూతా జ్ఞానవంతో గురుగీతాం జపంతి యే।
తేషాం దర్శన సంస్పర్శాద్దివ్యజ్ఞానం ప్రజాయతే॥

తే.గీ॥ పార్వతీ! విను కూర్చున్న, పండుకొనిన,
నిలచియున్నను, మరి పయనించుచున్న
ఏనుగుల, నుత్తమాశ్వాల నెక్కియున్న
మొనసి నిద్రించుచున్న మేల్కొనియెయున్న 248

తే.గీ॥ ఎంతయను శుద్ధులయి జ్ఞానవంతులగుచు
ప్రీతి గురుగీతనెవరు జపింపగలరొ
వారి దర్శనమునను సంస్పర్శవలన
జనులకు లభించు దివ్యసుజ్ఞానమవని 249

ఆత్మ, పరమాత్మయందు కలియు విధము :-

శ్లో॥ సముద్రేవై యథా తోయం క్షీరే క్షీరం జలే జలం।
భిన్నేకుంభే యథా ఽ ఽకాశం తథా ఽ ఽత్మా పరమాత్మని॥

తే.గీ॥ జలము జలమున, నదినీరు సాగరమున
పాలుపాలను, మరికుండ పగుల దాని
ఆకసంబు మహాకాశమందు కలియు
నటుల నాత్మయు పరమాత్మయందు కలియు 250

శ్లో॥ తథైవ జ్ఞానవాన్జీవః పరమాత్మని సర్వదా।
ఐక్యేన రమతే జ్ఞానీయత్ర కుత్ర దివా నిశమ్॥

ఆ.వె॥ జ్ఞానవంతుడైన సాధకుండీరీతి
ఏక రూపవిషయమెల్ల నెఱిగి
పగలు రేయి యనక బ్రహ్మమందు రమించు
ఉర్వినెక్కడేని ఒక్కచోట 251

శ్లో॥ ఏవంవిధో మహాయుక్త స్సర్వత్ర వర్తతే సదా।
తస్మాత్సర్వప్రకారేణ గురుభక్తిం సమాచరేత్॥

తే.గీ॥ ఆత్మ పరమాత్మ ఒక్కటేయని గ్రహించి
అనిశమును జ్ఞాని వర్తించు నన్నియెడల
దేశికు ననుగ్రహమున నీస్థితి లభించు
కాన గురుభక్తి దృఢముగా బూనవలయు 252

శ్లో॥ గురుసంతోషణాదేవ ముక్తో భవతి పార్వతి।
అణిమాదిషు భోక్తృత్వం కృపయా దేవి జాయతే॥

అ.వె॥ గురువునకు ముదంబు కూర్చుటవలననే
భక్తవరుడు తాను ముక్తినొందు
అష్టసిద్ధులైన అణిమాదులు లభించు
గురుని కరుణ వలన గిరి తనూజ 253

శ్లో॥ సామ్యేన రమతే జ్ఞానీ దివా వా యది వా నిశి।
ఏవంవిధో మహామౌనీ త్రైలోక్య సమతాం వ్రజేత్॥

తే.గీ॥ అతివ సామ్యము గల పరమాత్మయందు
సంతతంబు రమించును జ్ఞాని ధరణి
ఈ విధంబున తనరు మునీశ్వరుండు
మూడులోకాల సమతతో చూడగలడు 254

శ్లో॥ అథ సంసారిణః సర్వే గురుగీతా జపేన తు।
సర్వాన్ కామాంస్తు భుంజంతి త్రిసత్యం మమభాషితం॥

అ.వె॥ సాధ్వి! సంసారులెల్లరు శ్రద్ధ బూని
విమల గురుగీత నెపుడు జపింతురేని
అన్ని కోరికలను వారలను భవింత్రు
వినుము నామాట ముమ్మాటికిని నిజమ్ము 255

. గురుగీతా ఘనత :-

శ్లో॥ సత్యం సత్యం పునః సత్యం ధర్మసారం మయోదితం।
గురుగీతా సమం స్తోత్రం నాస్తి తత్త్వం గురోః పరమ్॥

తే.గీ॥ ధరణి గురుగీతబోలు స్తోత్రమ్ములేదు
వరుగురునికంటె శ్రేష్ఠతత్త్వమ్ము లేదు
రమణి! నామాట ధర్మసారమ్ము సుమ్మ
వనిత! యీ మాట ముమ్మాటికిని నిజమ్ము 256

గురుభక్తి ఫలము :-

శ్లో॥ గురుర్దేవో గురుర్ధర్మో గురౌ నిష్ఠా పరంతపః।
గురోః పరతరం నాస్తి త్రివారం కథయామితే॥

తే.గీ॥ గురువె దేవుండు ధర్మంబు గురువెయగును
గురుని యందున్న నిష్ఠయే పరమ తపము
గురువరున కంటె నన్యంబు ధరణి లేదు
కలికి ముమ్మారు నీకిదే తెలుపుచుంటి 257

శ్లో॥ ధన్యామాతా పితాధన్యో గోత్రం ధన్యం కులోద్భవః।
ధన్యాచ వసుధా దేవి యత్ర స్యాద్గురుభక్తతా॥

తే.గీ॥ ఎవని హృదయాన గురుభక్తి యెసగు నతని
తండ్రి ధన్యుండు, తల్లియు ధన్యురాలు
గోత్రమది ధన్యమాతని కులజాడరయ
ధన్యుడగును, వసుంధర ధన్యమగును 258

శ్లో॥ ఆకల్పజన్మకోటీనాం యజ్ఞ వ్రత తపః క్రియాః।
తాః సర్వాః సఫలా దేవి గురుసంతోషమాత్రతః॥

తే.గీ॥ ఎన్నియో కోట్ల జన్మంబులెత్తి మనుజు
డాచరించిన వ్రతములు, యజ్ఞతతులు
అఖిల తపములు సఫలంబు లగును గురుని
మదికి హర్షంబు పొడమిన మాత్రముననె 259

శ్లో॥ శరీర మింద్రియం ప్రాణ మర్థం స్వజన బంధుతా।
మాతృకులం పితృకులం గురురేవ న సంశయః॥

తే.గీ॥ పార్వతీ! దేహమింద్రియ ప్రాణములును
స్వజనులును, బంధుజనులును, సంపదలును,
తల్లిదండ్రుల వంశాలు ధాత్రియందు
సద్గురువె యగు గాదె నిస్సంశయముగ 260

57. గురుభక్తి లేని వారి గతి :-

శ్లో॥ మందభాగ్యా హ్యశక్తాశ్చ యేజనా నానుమన్యతే।
గురుసేవాసు విముఖాః పచ్యంతే నరకేఽశుచౌ॥

తే.గీ॥ రమణి! గురుసంస్మరించు కార్యమును విడిచి
మాన్యగురుసేవ చేయుట మాని వైచి
భాగ్య హీనులశక్తులై బ్రతుకు మనుజు
లపరి శుద్ధపు నరకంబు ననుభవింత్రు 261

శ్లో॥ విద్యాధనం బలం చైవ తేషాం భాగ్యం నిరర్థకమ్।
యేషాం గురుకృపా నాస్తి అధోగచ్ఛంతి పార్వతి॥

శ్లో॥ బ్రహ్మ విష్ణుశ్చ రుద్రశ్చ దేవాశ్చ పితృ కిన్న రాః,
సిద్ధచారణ యక్షాశ్చ అన్యే చ మునయో జనాః

ఆ.వె॥ పృథ్వి గురుని కరుణ ఎవరికి దొరకదో
వారికున్న విద్య, వారి ధనము
వారికున్న బలము, వ్యర్థంబు వ్యర్థంబు
వారధఃస్థలంబు జేరగలరు 262

తే.గీ॥ బ్రహ్మ, విష్ణువు, శివుడు, చారణులు, సురలు
గరుడ గంధర్వ పితృ యక్షవరులు మునులు
కనికరంబున నరుని జూచినను ధరణి
గురుని కృపలేక శుభము చేకూరదెపుడు 263

58. గురుపాదము సర్వతీర్థమయము :-

శ్లో॥ గురుభావః పరంతీర్థ మన్యతీర్థం నిరర్థకమ్।
సర్వతీర్థమయం దేవి శ్రీగురోశ్చరణాంబుజమ్॥

ఆ.వె॥ పరమ తీర్థమగును గురుదేవు రూపంబె
అన్య తీర్థములు నిరర్థకములు
సర్వతీర్థమయము సద్గురునాథుని
పాదపంకజంబు పద్మనయన! 264

59. వివేకహీనులు గురుగీతను వినరనుట :-

శ్లో॥ కన్యాభోగరతాః మందాః స్వకాంతాయాః పరాఙ్ముఖాః।
అతః పరం మయా దేవి కథితం న మమ ప్రియే॥

తే.గీ॥ అన్యకాంతల సుఖమునకాశపడుచు
స్వీయ పత్నుల వీడు వివేకహీను
లెట్లు విందురు శ్రద్ధతో నేను జెప్పు
పరమ గురుదేవు దివ్యతత్త్వమ్ము దేవి! 265

60. నాస్తికాదులకు గురుగీతను చెప్పకూడదనుట :-

శ్లో॥ ఇదం రహస్య మస్పష్టం వక్తవ్యం చ వరాననే।
సుగోప్యం చ తవాగ్రే తు మమాత్మ ప్రీతయే సతి॥

తే.గీ॥ అమల గురుతత్త్వ మిద్ది రహస్యమగును
వసుధ నస్పష్టమగును గోప్యంబునగును
నాకు సంప్రీతికరమిది నీకు జెప్ప
దగునటంచును దెలిపితి నగతనూజ! 266

శ్లో॥ స్వామిముఖ్యగణేశాద్యాన్ వైష్ణవాదీం శ్చ పార్వతి।
న వక్తవ్యం మహా మాయే పాదస్పర్శం కురుష్వ మే॥

ఆ.వె॥ ఇంతి! ముఖ్యులగు గణేశాదులకు, మరి
వైష్ణవాదులకును పరమగీత
చెప్పనంచు నీవు చేయుము శపథంబు
నాదు పాదమంటి నగకుమారి! 267

శ్లో॥ అభక్తే వంచకే ధూర్తే పాషండే నాస్తికాదిషు।
మనసాఽపి న వక్తవ్యా గురుగీతా కదాచన॥

ఆ.వె॥ పడతి! దుష్టులకును, భక్తిహీనులకును,
వంచకులకు వేదబాహ్యులకును,
ధరణి నాస్తికులకు వరగురుగీతను
చెప్పరాదు సుమ్మి యెప్పుడేని 268

61. ఉత్తమ గురువు దుర్లభుడనుట :-

శ్లో॥ గురవో బహవస్సంతి శిష్యవిత్తాపహారకాః।
తమేకం దుర్లభం మన్యే శిష్య హృత్తాపహారకమ్॥

తే.గీ॥ అతివ! శిష్యధనంబుల నపహరించు
గురువులెందరొ యున్నారు ధరణియందు
శిష్య హృత్తాపము హరించి వెలగు గురువు
దుర్లభుడటంచు తలచెద తోయజాక్షి! 269

62. వరగురువు లక్షణము :-

శ్లో॥ చాతుర్యవాన్ వివేకీ చ అధ్యాత్మజ్ఞానవాన్ శుచిః।
మానసం నిర్మలం యస్య గురుత్వం తస్య శోభతే॥

తే.గీ॥ జ్ఞాన బోధల నెవ్వడు చతురుడగునొ
వసుధ అధ్యాత్మ సుజ్ఞాన వంతుడెవడొ
ఎవ్వడు వివేకి, పరిశుద్ధు, డెవరి మనసు
విమల, మాతని గురుత శోభిల్లు దేవి! 270

శ్లో॥ గురవో నిర్మలా శ్శాంతాః సాధవో మితభాషిణః।
కామక్రోధ వినిర్ముక్తాః సదాచారా జితేంద్రియాః॥

తే.గీ॥ శాంత భావంబు, విమలత, సాధుతయును
నయ సదాచారమును, జితేంద్రియత, క్రోధ
కామ హీనత, మితవాక్కు, గలుగు వారి
వరగురువు లంచు జెప్పగా వలయుదేవి! 271

13. సూచకాది గురువులు :-

శ్లో॥ సూచకాది ప్రభేదేన గురవో బహుధా స్మృతాః।
స్వయం సమ్యక్ పరీక్ష్యాథ తత్త్వనిష్ఠం భజేత్సుధీః॥

తే.గీ॥ తరుణి! విను సూచకాది భేదములచేత
పిలువ బడుదురు గురువులు పలు విధాల
తగ పరీక్షించి సుమతులు తమకు దామె
తత్త్వనిష్ఠుని సేవింపదగు భవాని 272

శ్లో॥ వర్ణజాలమిదం తద్వద్బాహ్య శాస్త్రన్తు లౌకికమ్।
యస్మిన్దేవి సమభ్యస్తం సగురు స్సూచకః స్మృతః॥

తే.గీ॥ ఆత్మవిద్యకు భిన్నమైనట్టి చదువు
వర్ణజాలంబు మొదలుగా బాహ్యలోక
శాస్త్రచయమును తానేర్మి ఛాత్రులకును
గఱపు నాతడు సూచక గురువు దేవి! 273

శ్లో॥ వర్ణాశ్రమోచితాం విద్యా ధర్మాధర్మవిధాయినీం।
ప్రవక్తారం గురుం విద్ధి వాచకన్త్వితి పార్వతి॥

తే.గీ॥ తరుణి! వర్ణాశ్రమములకు తగిన యట్టి
వివిధ సార ధర్మాధర్మ విషయములను
తెలుపు విద్యను శ్రద్ధ శిష్యులకు నేర్పు
గురుని వాచకుడందురు సరసిజాక్షి! 274

శ్లో॥ పంచాక్షర్యాది మంత్రాణా ముపదేష్టా తు పార్వతి।
స గురుర్బోధకో భూయా దుభయోరయ ముత్తమః॥

తే.గీ॥ ఇంతి! పంచాక్షరీమంత్ర మితరములను
పూని నేర్పెడు నాతడె బోధకుండు
ధరణి సూచక వాచక గురులకంటె
బోధకుండుత్తముడు సుమ్మి పూవుబోణి! 275

శ్లో॥ మోహ మారణ వశ్యాది తుచ్ఛ మంత్రోపదేశినం।
నిషిద్ధగురు రిత్యాహుః పండితా స్తత్త్వదర్శినః॥

తే.గీ॥ అతివ! మారణ, మోహ, వశ్యాది, తుచ్ఛ
మంత్రజాలంబు శిష్యసమాజమున కు
గఱపు వాని నిషిద్ధాఖ్య గురువటంద్రు
తత్త్వ దర్శనులైన విద్వాంసులెల్ల 276

శ్లో॥ అనిత్యమితి నిర్దిశ్య సంసారం సంకటాలయం।
వైరాగ్యపద దర్శీ యః స గురుర్విహితః ప్రియే॥

తే.గీ॥ సంకటాలయమైన సంసారమరయ
ఇల ననిత్యమటంచును తెలియజెప్పి
ప్రీతి వైరాగ్యపదము చూపించునతని
విహిత గురువని యందురు విబుధవంద్య! 277

శ్లో॥ తత్త్వమస్యాది వాక్యానాముపదేష్టా తు పార్వతి।
కారణాఖ్యో గురుః ప్రోక్తో భవరోగ నివారకః॥

తే.గీ॥ పార్వతీ! తత్త్వమస్యాది వాక్యములను
తనదు శిష్యుల కుపదేశమును పొనర్చి
మించు భవరోగమును నివారించునట్టి
గురువరుని కారణాఖ్యుడందురు భవాని! 278

శ్లో॥ సర్వసందేహ సందోహ నిర్మూలన విచక్షణః।
జన్మమృత్యు భయఘ్నో యః స గురుః పరమో మతః॥

తే.గీ॥ సాధ్వి! వినుశిష్య సందేహ సంచయమును
నిమిష మాత్రాన దీర్చెడు నిపుణుడగుచు
జన్మమృత్యు భయంబును సంహరించు
నతని పరమ గురుండని అత్మదలతు 279

శ్లో॥ బహుజన్మ కృతాత్పుణ్యాల్లభ్యతే ఽసౌ మహాగురుః।
లబ్ధ్వా ఽముం న పునర్యాతి శిష్యః సంసారబంధనమ్॥

తే.గీ॥ అరయ బహుజన్మముల జేసినట్టి పుణ్య
ఫలము వలన లభించును పరమ గురువు
పృథ్వినిట్టి గురుండు లభించునెడల
శిష్యు సంసారబంధంబు చేరదింక 280

శ్లో॥ ఏవం బహువిధా లోకే గురవస్సంతి పార్వతి।
తేషు సర్వప్రయత్నేన సేవ్యో హి పరమోగురుః॥

తే.గీ॥ పార్వతీదేవి! వినుమిది బహువిధాల
నుందు రీరీతి లోకమునందు గురులు
పట్టుదల మీర యత్నించి వారి యందు
పరమ గురువును సేవింప వలయు నరుడు 281

నిషిద్ధ గురునియొక్క శిష్యుని గతి :-

శ్లో॥ నిషిద్ధ గురుశిష్యస్తు దుష్టసంకల్ప దూషితః।
బ్రహ్మప్రళయ పర్యంతం న పునర్యాతి మర్త్యతామ్॥

తే.గీ॥ ఓసతి! నిషిద్ధ గురుని శిష్యుండు క్రూర
భావములు గల్గి నిందింపబడును, గాన
అతడటు మీద బ్రహ్మలయంబు వరకు
మరల ధారుణి పొందడు మనుజ జన్మ 282

శ్లో॥ ఏవం శ్రుత్వా మహాదేవీ మహాదేవ వచస్తదా।
అత్యంత విహ్వల మనాశ్శంకరం పరిపృచ్ఛతి॥

ఆ.వె॥ వామదేవుడిట్లు వచియించు చుండగా
ఆలకించుచున్న హైమవతియు
స్వాంతమందు భయము బాధయు పొంగగా
ఆత్మధవుని జూచి అడిగెనిటుల 283

శ్రీ పార్వత్యువాచ

శ్లో॥ నమస్తే దేవదేవాత్ర శ్రోతవ్యం కించిదస్తి మే।
శ్రుత్వా త్వద్వాక్య మధునా భృశం స్యాద్విహ్వలం మనః॥

వ॥ పార్వతీదేవి పలికెను.

తే.గీ॥ వందనము దేవవందిత! వందనమ్ము
తెలిసికొన దగు నంశంబు కలదు నాకు
ఇట నిషిద్ధాఖ్య శిష్యుని వృత్తి విన్న
అభవ! నామది విహ్వల మయ్యెమిగుల 284

శ్లో॥ స్వయం మూఢా మృత్యుభీతా స్సుకృతాద్విరతింగతాః।
దైవాన్నిషిద్ధగురుగా యది తేషాం తు కా గతిః॥

తే.గీ॥ మృత్యుభీతులు పుణ్య విహీనులైన
సహజ మూఢులు దైవ వశమ్ముచేత
ఇల నిషిద్ధాఖ్య గురునాశ్రయింతురేని
వారి గతి యేమి తెల్పుము వామదేవ! 285

శ్రీ మహాదేవ ఉవాచ

శ్లో॥ శృణు తత్త్వమిదం దేవి యదా స్యాద్విరతో నరః।
తదాఽసావధికారీతి ప్రోచ్యతే శ్రుతిమస్తకైః॥

వ॥ ఈశ్వరుడు పలికెను.

తే.గీ॥ దేవి విను! తత్త్వమిద్ది నే తెల్పుచుంటి
ఎవ్వడు నిషిద్ధ గురుని తానిట్టె విడుచు
మనుజు డప్పుడె అధికారి యనుచు ధాత్రి
ఉపనిషత్తులు తెలియ జేయును భవాని 286

65. సాధకునికి గురునిగా నుండదగిన వ్యక్తి :-

శ్లో॥ అఖండైకరసం బ్రహ్మ నిత్యముక్తం నిరామయమ్।
స్వస్మిన్సందర్శితం యేన స భవేదస్య దేశికః॥

తే.గీ॥ నిత్యముక్తుడఖండుడు నిర్మలుండు
నతిశయానందుడగు పరమాత్మునెవడు
చెలగి తనయందు దర్శింప జేయగలడొ
అతడె నరునికి దేశికుండగును దేవి! 287

6. పరమ గురువుయొక్క ఉత్తమ లక్షణములు :-

శ్లో॥ జలానాం సాగరో రాజా యథా భవతి పార్వతి।
గురూణాం తత్ర సర్వేషాం రాజాఽయం పరమోగురుః॥

తే.గీ॥ అంబికా! విను, సర్వజలంబులకును
వనధియట్టుల రాజయి తనరుచుండు
సర్వ గురుసంచయమునకు జగతియందు
పరమ గురువట్లె రాజయి పరగుచుండు 288

శ్లో॥ మోహాది రహిత శ్శాంతో నిత్యతృప్తో నిరాశ్రయః।
తృణీకృత బ్రహ్మవిష్ణువైభవః పరమో గురుః॥

తే.గీ॥ విమల శాంతుండు మోహాది విరహితుండు
సతత సంతృప్తుడును నిరాశ్రయుడు బ్రహ్మ
హరి విభవ మాత్మ లెక్కింప నట్టివాడు
పరమ గురువని విఖ్యాతి పడయుదేవి! 289

శ్లో॥ సర్వకాల విదేశేషు స్వతంత్రో నిశ్చల స్సుఖీ।
అఖండైక రసాస్వాద తృప్తో హి పరమోగురుః॥

తే.గీ॥ సర్వకాలంబులన్ విదేశముల యందు
నిశ్చలుండు స్వతంత్రుండు నిత్య సుఖియు
అవిరళాద్భుత మహిత రసానుభూతి
ధరణి సంతృప్తుడగు వాడు పరమ గురువు 290

శ్లో॥ ద్వైతాద్వైత వినిర్ముక్తః స్వానుభూతి ప్రకాశవాన్।
అజ్ఞానాంధ తమశ్ఛేత్తా సర్వ జ్ఞః పరమోగురుః॥

తే.గీ॥ ద్వైతమద్వైత మనెడు వాదముల విడిచి
విమల మగు స్వాను భవమున వెలుగువాడు
మించు నజ్ఞాన తమము ఛేదించువాడు
ధరణి సర్వజ్ఞుడగువాడు పరమగురువు 291

శ్లో॥ యస్యదర్శన మాత్రేణ మనసః స్యాత్ప్రసన్నతా।
స్వయంభూయాత్ ధృతి శ్శాంతిః స భవేత్ పరమోగురుః॥

తే.గీ॥ మగువ! ఎవ్వని దర్శన మాత్రముననె
చిత్తమందు ప్రసన్నత చేరగలదొ
అప్రయత్నమ్ముగా ధైర్య, మమల శాంతి
ప్రభవ మందునొ ఆతడే పరమగురువు 292

శ్లో॥ సిద్ధిజాలం సమాలోక్య యోగీనాం మంత్రవాదినాం।
తుచ్ఛాకార మనోవృత్తిః యస్యాసౌ పరమోగురుః॥

తే.గీ॥ తరుణి! యోగంబు వలన, మంత్రంబు వలన
కలుగు అణిమాది సిద్ధులగాంచి అవ్వి
హీనము, లనిత్యములటంచు నెద తలంచు
భవ్య వైరాగ్య వంతుండు పరమగురువు 293

శ్లో॥ స్వశరీరం శవం పశ్యన్ తథా స్వాత్మాన మద్వయం।
యస్త్రీ కనక మోహఘ్నః స భవేత్పరమోగురుః॥

తే.గీ॥ తన శరీరంబు శవమని తలచి, తానె
అద్వితీయాత్మయనెడు సత్యంబు నెరిగి
స్త్రీధన విమోహమును మది చేరనీక
ధరణి వెలుగొందు నాతడె పరమగురువు 294

67. వాగ్మి – మౌని :-

శ్లో॥ మౌనీ వాగ్మీతి తత్త్వజ్ఞో ద్విధాఽభూచ్ఛృణు పార్వతి।
న కశ్చిన్మౌనినాం లోభో లోకేఽస్మిన్భవతి ప్రియే॥

తే.గీ॥ వాగ్మియని మౌనియనియు తత్వజ్ఞులందు
పార్వతీ! రెండు విధముల పరగుచుంద్రు
మౌనులేకోరికలకును లోనుగారు
జగతి యందెప్పుడును చూడ జలజ నయన! 295

శ్లో॥ వాగ్మీతూత్కట సంసార సాగరోత్తరణ క్షమః।
యతోఽసౌ సంశయచ్ఛేత్తా శాస్త్రయుక్త్యనుభూతిభిః॥

తే.గీ॥ శాస్త్రయుక్త్యను భూతిచే ఛాత్రతతికి
కలుగు సంశయముల నెల్ల తొలగజేసి
వేగ వారిని సంసార సాగరంబు
దాట జేయ సమర్థుండు ధాత్రి వాగ్మి 296

శ్లో॥ గురునామ జపా ద్దేవి బహుజన్మార్జితాన్యపి।
పాపాని విలయం యాంతి నాస్తి సందేహ మణ్వపి॥

తే.గీ॥ సాధ్విరో! విను గురునామ జపము చేత
పూర్వ బహు జన్మముల యందు పొందియున్న
సర్వపాప చయంబు నాశంబు నొందు
నిందు సందేహమణువంత యేనిలేదు 297

శ్లో॥ శ్రీగురోస్సదృశం దైవం శ్రీగురోస్సదృశః పితా।
గురుధ్యాన సమంకర్మ నాస్తి నాస్తి మహీతలే॥

తే.గీ॥ పరమగురుదేవుబోలు దైవంబు లేదు
ధాత్రి గురువరు బోలిన తండ్రిలేడు
ఘన గురుధ్యాన సదృశ సత్కర్మలేదు
నిక్కమిది నిక్కమే యిది నీరజాక్షి! 298

8. మరణవేళ గురువే శిష్యుని తరింప జేయుట :-

శ్లో॥ కులం ధనం బలం శాస్త్రం బాంధవా స్సోదరా ఇమే।
మరణే నోపయుజ్యంతే గురురేకోహి తారకః॥

తే.గీ॥ కులము ధనమును శాస్త్రంబు బలము మరియు
ఆత్మబంధువులనుజాలు నగ్రజాలును
ధరణి నుపయోగ పడరెందు మరణవేళ
శ్రీ గురువొకండె శిష్యు తరింప జేయు 299

69. గురుసేవా ఫలము :-

శ్లో॥ కులమేవ పవిత్రంస్యాత్ సత్యం స్వగురుసేవయా।
తృప్తాస్స్యు స్సకలా దేవా బ్రహ్మాద్యా గురుతర్పణాత్॥

తే.గీ॥ సంతతంబును గురుసేవ సలుపునెడల
అతని కులమంతయు పవిత్రమగును నిజము
తృప్తులగుదురు గురువు సంతృప్తి నొంద
బ్రహ్మమొదలగు సర్వదేవతలు దేవి! 300

శ్లో॥ గురురేకోహి జానాతి స్వరూపం దైవ మవ్యయమ్।
తజ్జ్ఞానం యత్ప్రసాదేన నాన్యథా శాస్త్రకోటిభిః॥

తే.గీ॥ అవ్యయంబైన ఆ పరమాత్మరూపు
గురువరుండొక్కడే మదినెరుగజాలు
అట్టి జ్ఞానంబు గురుకృపనబ్బుగాని
శాస్త్రకోటులచే రాదు సారసాక్షి 301

శ్లో॥ స్వరూపజ్ఞాన శూన్యేన కృత మప్యకృతం భవేత్।
తపోజపాదికం దేవి సకలం బాలజల్పవత్॥

తే.గీ॥ ధరణి నాత్మస్వరూపంబు నెఱుగలేని
నరులు వ్రతమును, తపము, ధ్యానమ్ము, జపము
చేయు చున్నను బాల భాషితము వోలె
చేయ నట్టుల విఫలత జెందు దేవి! 302

70. ప్రజల వ్యర్థ వాదము :-

శ్లో॥ శివం కేచిద్ధరిం కేచిత్ విధిం కేచిత్తు కేచన।
శక్తిం దైవమితి జ్ఞాత్వా వివదంతి వృథా నరాః॥

తే.గీ॥ హరుడు దైవంబటంచు కొందరును, హరియె
దైవమని కొందరును, బ్రహ్మదైవమనుచు
కొందరును, శక్తియని మరికొందరిటుల
జనులు వ్యర్థముగా వాదమును ఘటింతు
రెల్ల రూపులు గల ఈశు నెఱుగలేక 303

1. గురువు లేక పరతత్త్వ మెరుగలేరనుట :-

శ్లో|| న జానంతి పరంతత్త్వం గురుదీక్షా పరాఙ్ముఖాః|
భ్రాన్తాః పశుసమా హ్యేతే స్వపరిజ్ఞాన వర్జితాః||

తే.గీ|| విమల గురుదీక్ష గొనుటకు విముఖులైన
నరులు పరతత్త్వమెపుడేని నెరుగ గలరె!
ఆత్మ సుజ్ఞానమును పొందనట్టివారు
భ్రాంతులగుచును పశువుల పగిదినుంద్రు 304

శ్లో|| తస్మాత్కైవల్య సిద్ధ్యర్థం గురుమేవ భజే త్ప్రియే|
గురుం వినా న జానంతి మూఢాః తత్పరమం పదమ్||

తే.గీ|| అందువలననె కైవల్య మబ్బు కొరకు
పరమ గురు నాశ్రయింపగా వలయుదేవి!
గురువు లేకున్నచో మూఢులెరుగ గలరె
అట్టి పరతత్త్వమును భువి నచల తనయ 305

శ్లో|| భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః|
క్షీయంతే సర్వకర్మాణి గురోః కరుణయా శివే||

తే.గీ|| కమల దళనేత్ర! గురువరుకరుణ వలన
ధరణి భేదింపబడును హృద్గ్రంథులెల్ల,
సరవి ఛేదింప బడును సంశయములెల్ల
రమణి క్షీణించు జనుల కర్మంబులెల్ల 306

శ్లో|| కృతాయా గురుభక్తేస్తు వేదశాస్త్రానుసారతః|
ముచ్యతే పాతకాద్ఘోరాత్ గురుభక్తో విశేషతః||

తే.గీ|| అద్రిజా! వేదశాస్త్రాల ననుసరించి
విమల సద్భక్తి గురుని సేవించు నెడల
వితత ఘోర మహాపాప వితతి నుండి
భక్తవర్యుడు వేగ విముక్తుడగును 307

